Photo by E. Ramalingam



బహుమతి
పొందిన వ్యాఖ్య

సాగితే ప్రయాణం

పంపినవారు :
పి. కామాచార్యులు - రేమల్లి

# అందముగ మన్నే ఒక అందమైన చీర!

మీరు బిన్నీవారి అసలైన సిల్కు జార్జెట్ చీర కట్టుకుంటే ఎంతో అందముగ కనపడతారు. అది అసలైన సిల్కుతో నేయబడినది కనుక దాని మెత్తదనము మరియు సహజమైన తళతళ చాల కాలము ఉండును.

బిన్నీవారి అసలైన సిల్కు జార్జెట్ చీరలను ఎన్నో సార్లు యింటివద్ద ఉతుకుకున్నా అవి ఒంటి మీద అందముగ నిలిచేలా ఉంటాయి. వాటి మనోహరమైన రంగులు పోవు.

అందముగ చాల కాలము మన్నే బిన్నీ వారి సిల్కు జార్జెట్ చీరలను కొనండి!



బిన్నీవారి యితర సిల్కు చీరలు

మెత్తని సిల్కు చీరలు: పుష్ప దళమువంటి ఈ మెత్తని సిల్కు చీరలు బంగారు అంచు మరియు సరిక్రొత్త డిజైనులతో తళతళలాడే రంగులలో దొరకుతున్నాయి. వీనిని యింటివద్ద ఉతుకుకోవచ్చును.

క్రేప్ సిల్కు చీరెలు: ఈ కొత్త అందమైన, స్వచ్ఛమైన సిల్కు చీరె నేత్రానందకరమైనది. అందమైన బంగారు అంచులు.



అసలైన బిన్నీవారి చీరలన్నిటిమీద బంగారు రంగులో యీ ముద్ర వేయబడియున్నది

బెంగుళూరు వులెన్, కాటన్ అండ్ సిల్కు మిల్స్ కంపెనీ లిమిటెడ్
మ్యానేజింగ్ ఏజెంట్లు:
బిన్నీ అండ్ కంపెనీ (మద్రాసు) లిమిటెడ్

BY. 3120 a (R)

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక చిత్రకథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు - విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.


చందమామ (అన్ని భాషలలో)

విడి కాపీ **50** నయా పైసాలు. (**8** అణాలు)

సాలు చందా రు **6** లు.

THE CHOICE

# Pencils




**AJANTHA**
BLACK LEAD
**EMBESEE**
BLACK LEAD
**IMPERIAL**
COPYING
**ACCOUNTANT**
COLOUR
**CHECKING**
COLOUR
**SPECTRUM**
12, COLOURS

*Manufactured by*
**THE MADRAS PENCIL FACTORY**

3, STRINGER STREET,
MADRAS.



ధైర్యశాలి
రాము



డంబాల
రంగా





నేనొకనాడు అడవిలోకి చాలాఎక్కువ
దూరం, వెళ్లాను....



అక్కడ నే నొక నక్కను చూశాను....
నేను ఇంకా చెయ్యెత్తానో లేదో, అది
చుంచులాగపారిపోయింది.



తరువాత అక్కడికో
భయంకరమైన సింహం
వచ్చింది!



కాని, నేనేమాత్రమూ భయ పడలేదు సుమా!
సరిగ్గా దానికళ్లల్లోకి తీవ్రంగా చుశాను,
ఆ సింహం అసలు అక్కడికి రానే లేదు
అనిపించేలాగ మాయమైపోయింది!


ఇలా ప్రగల్భాలు కొట్టు
తున్నప్పుడే అక్కడికి
కొకుక్క వచ్చింది,
ఇంక రంగా పారి -
పోయి చెట్టు
మీదకెక్కాడు.


భయ
పడకు
రంగా.
ఇది
మోతీయే-
నాకుక్క.


నేనే మీా భయ
పడలేదు. నిజ
స్థదను నేనెంత
మాత్రమూ భయ
పడలేదు.
అలాగైతే,
నీవు నిజస్థు
డవు కూడాను,
కదూ? ఇంతెం
దుకు, నీలాంటి
బలహీనుడైన
పిరికి వాడుచీ
ఒకఈగనైనా
చంపలేడు!


అలా అనుకుంటున్నావా?
అయితేనాతో పరుగుపందె
మునకురా ప్రతిమాటూ
నిన్ను ఓడించేస్తాను.


ఎంతో దూరం పరుగెత్త నేలేదు, అప్పుడే
రంగా ఒగురుస్తున్నాడు.


ఇలా చూడు, రంగా
నీవు సరిగ్గా నాలాగ
బలంగా వుండాలంటే,
నీవు డాల్డాతో వండ
బడిన ఆహారం భుజిం
చాలి, ప్రతిరోజూ
పాలుకూడా త్రాగాలి,
తెలిసిందా?





# జాన్సన్ అండ్ జాన్సన్
## సౌగసైన పాపాయిలకు ఒక సౌగసైన పౌడరు




**ఉచిత పుస్తకము:** పిల్లల సంరక్షణను గురించిన ఉచితముగా దొరకే జాన్సన్ యొక్క పుస్తకము కావాలని వ్రాయండి. దీనిలో తల్లి తండ్రులకు ఉపయోగపడే విషయములు ఎన్నో ఉన్నాయి. మీకు యింగ్లీషు మరియు హిందీ పుస్తకములలో ఏది కావాలో తెలపండి

జాన్సన్ అండ్ జాన్సన్, పి.ఓ. బాక్సు 1976, డిపార్ట్‌మెంట్ 40-ఇ బొంబాయి

J B : 4165




—: డిస్ట్రిబ్యూటర్లు :—

ఆంధ్ర & సీడెడ్ : విజయ పిక్చర్స్

నైజాం & మైసూరు : ది కర్ణాటక ఫిలిమ్స్ లిమిటెడ్










# జమైక్స్

క్లోరోఫిల్‌తో కూడినది

## విషనివారకమైన మహాన్నుడు తైలము

గాయములు, నరుకులు, తీట, గజ్జి, తామర, కురుపులు, కాట్లు, కుట్లు, పేలుడు, మొటిమలు మొదలైన చర్మవ్యాధులన్నిటికి అమోఘముగ గుణమిచ్చును.

## చందాదారులకు మనవి



పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోష్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. అ పైబడి వచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

"చందమామ"కు పదేళ్లు నిండాయి. పదకొండో ఏడు ప్రారంభమయింది. ఈ పదేళ్ల కాలంలోనూ "చందమామ" దేశంలోని అశేష ప్రజల అదరాభిమానాలను అపారంగా సంపాదించుకున్నది.

1947 జులైలో "చందమామ" తెలుగు, తమిళ భాషలలో మొట్టమొదటగా అవతరించింది. తరువాత ఈ పత్రిక ఇతర భాషలలోకూడా వెలువడసాగింది. కన్నడ, హిందీ, మళయాళ, మరాఠీ, గుజరాతీ, ఇంగ్లీషు, ఒరియా, సింధీ భాషలలో కొత్త "చందమామ"లు, ఒకదానివెంట ఒకటి ఉదయించి, ఆనంద కిరణాలను దేశమంతటా పరిచాయి.

దేశం అన్ని ప్రాంతాలనుంచీ, అన్నివర్గాల ప్రజలనుంచీ "చందమామ"కు అంతులేని ప్రోత్సాహం లభించింది. ఇందుకుగాను మేము దేశప్రజలకు ఎంతో ఋణపడి ఉన్నాము. ఈ ప్రోత్సాహం ఇకముందు కూడా "చందమామ"కు లభిస్తూ ఉంటుందని ఆశ.



సంపుటి 21 జూలై 1957 సంచిక 1



# అట్టమీది బొమ్మ

కీచకుడికి మాట ఇచ్చిన ప్రకారం రాణీ సుధేష్ణ ద్రౌపదిని పిలిచి, "సైరంధ్రి, నాకు చాలా దాహంగా ఉంది. నువు మా తమ్ముడి ఇంటికి వెళ్లి కాస్త మద్యం పట్టుకురా!" అన్నది.

"మీ తమ్ముడు నన్ను విపరీతంగా మోహించి ఉన్నాడు. నేను ఆయన ఇంటికి వెళ్లను, మరెవరినైనా పంపరాదా?" అన్నది ద్రౌపది.

"నేను పంపానంటే మా తమ్ముడు నిన్నేమీ చేయడు. వెంటనే వెళ్లిరా!" అని సుధేష్ణ ద్రౌపదిని నిర్బంధించింది. విధిలేక ద్రౌపది ఒక బంగారు పాత్ర తీసుకుని కీచకుడి ఇంటికి వెళ్లింది. ద్రౌపదిని చూడగానే కీచకుడు తన కోరిక నెరవేరిందనుకుని, ఆమె చెయ్యి పట్టుకున్నాడు. వెంటనే ద్రౌపది అతని పట్టు విడిపించుకుని బయటికి పరిగెత్తింది. కీచకుడు ఆమెవెంట పడ్డాడు.

ద్రౌపది నేరుగా విరాటరాజు కొలువుకు వెళ్లింది. కాని కీచకుడు రాజ సభనుకూడా పాటించక ద్రౌపదిని జుట్టు పట్టుకుని పడదోశాడు. ఇది చూసి సభలో ఒక్కరుకూడా, ఇదేమిటని కీచకుణ్ణి వారించలేకపోయారు.

ఒక్క భీముడుమటుకు రోషంతో పరవశుడైపోయి, పళ్ళు పటపట కొరుకుతూ, సమీపంలో ఉన్న పెద్ద చెట్టును పెరకబోయాడు. సమయానికి ధర్మరాజు, "పిచ్చివాడా, ఆ పచ్చిచెట్టు నీకు వంటచెరుకుగా పనికిరాదు. దాని నెందుకు పెరుకుతావు?" అని భీముణ్ణి నివారించాడు.

కీచకుడు తనను ఇలా అవమానిస్తుంటే, తన భర్తలుసయితం చూస్తూ ఊరుకోవటం చూసి మండిపోతూ, ద్రౌపది విరాటరాజుతో, "నా భర్తలు మహా శక్తిమంతులైకూడా ఏమీ చెయ్యలేనప్పుడు, రాజువైన నీవుకూడా ఈ దుర్మార్గుణ్ణి మందలించక ఊరుకున్నావేమిటి?" అని అడిగింది.

విరాటరాజుకు కీచకుణ్ణి శాసించే ధైర్యం లేదు. "నీకూ అతనికీ మధ్య చాటుగా ఏమి సంబంధమో నాకేం తెలుసు?" అన్నాడాయన.

ధర్మరాజు పరిస్థితి విషమిస్తుందని భయపడి ద్రౌపదిని కోపంగా, "ఓసీ, నీకీ రాజసభలో ఏమి పని? నీకు పరాభవం జరిగితే, సమయం కనిపెట్టి నీ భర్తలు దానికి ప్రతిక్రియ చేయరా?" అని మందలించాడు. ద్రౌపది లేచి కోపంతోనూ దుఃఖంతోనూ కన్నీరు కార్చుతూ అంతఃపురానికి వెళ్లిపోయింది.




బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో అయనవద్ద పింగళుడనే పురోహితుడొకడుండే వాడు అయన శరీర చ్ఛాయ పింగళవర్ణం, అయన తల బట్టతల, నోరు బోసినోరు.

బోధిసత్త్వుడు తక్కారియుడనే యువకుడుగా పింగళుడికి శిష్యుడై విద్యాభ్యాసం చేస్తూ ఉంటున్నాడు.

రాజపురోహితుడైన పింగళుడికి ఒక బావమరిది ఉన్నాడు. అయనకూడా పింగళ వర్ణమూ, బట్టతలా, బోసినోరూ కలవాడు. కాని ఆ ఇద్దరికీ బద్ధవైరం. తన బావమరిదిని ఎలాగైనా నాశనం చేతామనే దుర్బుద్ధితో పింగళుడు చాలా యత్నాలు చేశాడు గాని అవేవీ ఫలించ లేదు.

చిట్టచివరకు పింగళుడు తన బావమరిదిని చంపెయ్యటానికి ఒక యుక్తి పన్నాడు. అయన రాజుగారివద్దకు వెళ్లి, "మహాప్రభూ, మన కాశీనగరం భారతదేశానికంతటికీ అత్యుత్తమ నగరం. తాము దేశంలోని రాజులందరిలోకీ చాలా గొప్పవారు. అలాటప్పుడు మన కోటలోనే నిర్మాణలోపం ఉండటం శోచనీయం. మన దక్షిణద్వారం నిర్మించటంలో తప్పున్నది. అది మనకు ఎంతో అశుభం. మనకు దానివల్ల దేశంలో ఎంతో అపఖ్యాతికూడానూ. ఆ దోషాన్ని వెంటనే సవరణ చెయ్యాలని, నా మనవి!" అని చెప్పాడు.

"అందుకుగాను మనం ఏం చేయాలి?" అని రాజుగారు పింగళుణ్ణి అడిగాడు.

"ఆ ద్వారాన్ని ముందు పడగొట్టాలి. తరవాత, శుభప్రదమైన కలపతెచ్చి మరొక ద్వారం తయారు చేయించాలి. అప్పుడు నగర దేవతలకు బలులు జరిపించి, శుభముహూర్తాన కొత్తద్వారాన్ని నిలబెట్టాలి," అన్నాడు పింగళుడు.





రాజుగారు సమ్మతించాడు. ఆయన అజ్ఞతో పింగళుడు దక్షిణద్వారాన్ని పడగొట్టించాడు. దాని స్థానంలో ఏర్పరచటానికి గాను కొత్త ద్వారం త్వరగానే తయారయిందికూడా.

పింగళుడు రాజుగారివద్దకు వెళ్ళి, "మహారాజా, కొత్త ద్వారం తయారయింది. అది నిలబెట్టటానికి రేపు దివ్యమైన ముహూర్తం ఉన్నది. బలి జరిపి ద్వారం నిలబెట్టటానికి తమ అనుమతి ఇవ్వండి!" అన్నాడు వినయంగా.

"బలి ఇవ్వటానికి ఏమేమి ఏర్పాట్లు జరగాలి?" అని రాజుగారు అడిగాడు.

"పింగళవర్ణమూ, బట్టతలా, బోసినోరూ గల ఒక బ్రాహ్మణ్ణి బలి ఇవ్వవలిసి ఉంటుంది, మహారాజా! ఈ ద్వారాన్ని సంరక్షించే మహాశక్తులను అలాటి బ్రాహ్మడి రక్తమాంసాలతో ముందుగా తృప్తిపరచాలి. ఆ తరవాత ఆ బ్రాహ్మణ్ణి అక్కడే పాతిపెట్టి, పాతినచోట కొత్తద్వారం నిలబెట్టాలి," అన్నాడు పింగళుడు.

"సరే, అలాంటి బ్రాహ్మడికోసం వెతికి తెప్పించి, ద్వారం పెట్టించు!" అన్నాడు రాజుగారు.

తనకు ప్రబలశత్రువైన తన బావమరిదిని హతమార్చటానికి రాజుగారి అనుమతి దొరికిందిగదా అని పింగళుడికి పరమానందం కలిగింది.

ఈ ఆనందంలో ఆయన ఇంటికి వెళ్ళి తన భార్యతో, "ఇదుగో, రేపటితో నీ అన్నకు ఆయువు మూడింది! వాణ్ణి కొత్తద్వారానికి బలి ఇవ్వబోతున్నాను, చూసుకో!" అని నిర్భయంగా ప్రగల్భాలు పలికాడు.

"మా అన్ననే ఎందుకు బలి ఇవ్వాలీ? దానికి రాజుగారు ఎలా ఒప్పుకున్నారు?" అని పింగళుడి భార్య అడిగింది.

"ఫలానివాణ్ణి బలి యిస్తానని నేను రాజుగారితో చెప్పానా ఏమిటి? పింగళ



వర్ణమూ, బోసినోరూ కల బ్రాహ్మడు బలికి కావాలన్నాను, రాజుగారు సరేనన్నారు! రేపు నేను బయలుదేరి వెళ్ళి మీ అన్నను చూపించి, వాడు బలికి పనికివస్తాడంటాను. ఎవరు కాదంటారు?" అన్నాడు పింగళుడు.

పింగళుడి భార్య తన భర్తతో ఇంకేమీ అనక, తన అన్నకు రహస్యంగా జరిగిన విషయమంతా కబురుచేసి, ఈ గండం తప్పుకోవాలంటే తెల్లవారేలోపుగా ఊరుదాటి వెళ్ళిపొమ్మని సలహా యిచ్చింది.

తనను చంపటానికి పింగళుడు చేసిన ప్రయత్నమంతా తెలియగానే ఆయన బావ మరిది, తనలాగే పింగళవర్ణమూ, బోసినోరూ బట్టతలా ఉండేవారిని మరి ఒకరిద్దరిని కూడా కలుపుకుని, ఆ రాత్రే నగరం విడిచి వెళ్ళిపోయాడు.

మర్నాడు తెల్లవారుతూనే పింగళుడు రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, బలికి కావలసినటువంటి మనిషి ఫలాని చోట ఉంటాడు, వాణ్ణి యిక్కడికి పిలిపించండి!" అని చెప్పాడు.

వెంటనే రాజుగారు తన భటులను పంపాడు. వారు పింగళుడు చెప్పిన చోటికి వెళ్ళి, అక్కడఉండే మనిషి ఆ క్రితంరాత్రే దేశం విడిచి వెళ్లిపోయినట్టు తెలుసుకుని



ఆ విషయం రాజుగారికి నివేదించటానికి తిరిగి వచ్చారు.

భటులు చెప్పిన సంగతి వినగానే రాజుగారు, "అరెరే, ఇప్పుడేం చేసేటట్టు? అలాటి లక్షణాలు గల బ్రాహ్మణ్ణి ఎలాగైనా సంపాదించి తీరాలి!" అన్నాడు.

దానికి మంత్రులు, "ఇదేమంత పెద్ద సమస్య, మహారాజా? మన పురోహితుడిలో అవసరమైన లక్షణాలన్నీ ఉన్నాయిగద! ఆయననే బలి ఇప్పించండి!" అని రాజుకు సలహా ఇచ్చారు.

"అలాగే చేయవచ్చుగాని, నాకు పురోహితుడు లేకుండాపోతే ఎలా? అందుకు

తగినవాడు మరెవడైనా ఉన్నాడా? ఆ సంగతి ముందు ఆలోచించండి," అని రాజు మంత్రులను అడిగాడు.

"మన పురోహితుడివద్ద తక్కారియు డనే శిష్యుడున్నాడు. అతను గురువుకన్న కూడా తెలివిగలవాడని పేరుబడ్డాడు. అతన్ని తమరు పురోహితుడుగా పెట్టుకో వచ్చు," అని మంత్రులు చెప్పారు.

వెంటనే రాజుగారు తక్కారియుణ్ణి పిలిపించి, "నిన్ను ఇకనుంచీ నా పురో హితుణ్ణిగా నియమిస్తున్నాను. నువు ఈ పింగళుణ్ణి శాస్త్రోక్తంగా బలియిచ్చి, పాతి పెట్టించి, ఆయన మీదగా ద్వారం పెట్టించు!" అని ఆజ్ఞాపించాడు.

తక్కారియుడు దక్షిణద్వారం వద్దకు బయలుదేరి వెళ్లాడు. పింగళుణ్ణి యజ్ఞ పశువులాగా అలంకరించి చేతులూ కాళ్లూ బంధించి కొత్తద్వారంవద్దకు చేరవేశారు. బలి జరిపే నిమిత్తమై, ద్వారం ఏర్పాటు కావలిసినచోట, ఒక లోతైన గొయ్యి తవ్వి ఉన్నది. ఆ గోతిలోకి గురుశిష్యు లిద్దరూ ప్రవేశించారు.

పింగళుడు వలవలా ఏడుస్తూ, "ఒరే, శిష్యా! ఇంకొకరికోసం తవ్విన గోతిలో నేనే ప్రవేశించానుగదరా!" అన్నాడు.

"స్వామీ, అధికప్రసంగికి ఎప్పుడో ఒకప్పుడు ఆపద తప్పదు. మీరేమీ విచా రించకండి. నేను రాజుగారివద్దకు వెళ్ళి, సరి అయిన ముహూర్తం అర్ధరాత్రిదాకా లేదని చెబుతాను. ఆ తరవాత ఏదో ఒక ఉపాయం చేసి మీ ప్రాణాలు కాపాడ తాను!" అన్నాడు తక్కారియుడు.

అతను ఆ ప్రకారమే బలికి ముహూర్తం అర్ధరాత్రికి మార్పించాడు. ఆ రాత్రి చీకటిలో అతను పింగళుణ్ణి పారిపొమ్మని, ఒక చచ్చిన మేకను తెచ్చి గోతిలో పూడ్పిం చేసి, తెల్లవారేలోగా అక్కడ కొత్తద్వారం ప్రతిష్ఠ చేయించాడు.





# వేటగాడి వేట

కుందేలు తోడేలును తుదముట్టించిందన్న వార్త విన్నప్పటినుంచీ నక్కకు కుందేలు పేరు వింటేనే కాళ్ళు చల్లబడసాగాయి. ఇక జన్మలో తాను కుందేలు మీద చెయ్యి చేసుకోగూడదని నక్క నిశ్చయించుకున్నది.

అందుచేత కుందేలు ఎక్కడన్నా కనిపిస్తే నక్క ఒక చిరునవ్వు నవ్వి, "కులాసాయేగదా?" అని పలకరించి, తనదారిన తాను పోతూ ఉండేది.

త్వరలోనే నక్కకూ, కుందేలుకూ మళ్ళీ పాత స్నేహం ఏర్పడింది. ఒకరింటికి ఒకరు వెళ్లటమూ, కాస్సేపు కూచుని లోకాభిరామాయణం మాట్లాడుకోవటమూ జరుగుతూ వచ్చింది.

ఒకనాటి సాయంకాలం నక్క కుందేలు ఇంటికి వెళ్లి కాసేపు ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పి, "రేపు ఉదయమే బయలుదేరి వెళ్లి సాయంకాలందాకా అడవిలో వేటాడదా మనుకుంటున్నాను. సరదాగా వస్తావా ఏమిటి?" అని కుందేలు నడిగింది.

"అబ్బో, నాకు బోలెడన్ని పనులు! నాకు తీరదులే! నువు వెళ్లి వేటాడిరా! నాకు పనికివచ్చే దేమన్నా ఉంటే ఇద్దువుగాని!" అన్నది కుందేలు.

మర్నాడు నక్క తెల్లవారకముందే లేచి గోతం ఒకటి భుజాన వేసుకుని వేటకు బయలుదేరింది. సాయంకాలందాకా వేటాడగా దానికి కొన్ని అడివిబాతులూ, ఇతర పక్షులూ దొరికాయి. వాటన్నిటినీ గోతంలో వేసుకుని, నక్క ఇంటిదారి పట్టింది.

ఈలోపల కుందేలు రోజల్లా ఇంట్లోనే గడిపి సాయంకాలం వేళకు నక్క తిరిగి వచ్చే దారిలో కాపు వేసింది. ఈలవేసి పాడుతూ నక్క వచ్చే అలికిడి వినపడగానే కుందేలు దారిపక్కన చచ్చిపోయినదానిలాగా పడుకున్నది.

టి. శంభుదాసు

నక్క త్వరలోనే అటుగా వచ్చి చచ్చి నట్టు పడిఉన్న కుందేలును చూసి ఆగి, "అబ్బో, పోతంత కుందేలు! ఈ మూటను ఇంట్లో పెట్టి మళ్లీ వచ్చి తీసుకుపోతాను. కుందేలు మాంసం తిని ఎంతో కాల మయింది!" అని బిగ్గరిగా అనుకుని, ముందుకు సాగింది.

నక్క పోగానే కుందేలులేచి, శరవేగంతో అడ్డదారిన పరిగెత్తి, నక్క వెళ్లేదారిలో ఇంకొకచోట చచ్చిపోయినట్టు పడుకున్నది. కొద్దిసేపట్లో నక్క అటుగా వచ్చింది. దారి పక్కన కుందేలు కనిపించింది.

నక్క దాన్ని చూడగానే మళ్లీ ఆగి, "ఇంకో పోతంత కుందేలు! ఇవాళ అడవిలో కుందేళ్లన్నీ చస్తున్నట్టున్నాయి. వీటిని పోనివ్వగూడదు. ఈ మూట ఇక్కడే పెట్టి వెనక్కు పోయి ఆ కుందేలునుకూడా తెచ్చుకుంటాను!" అంటూ వెనక్కు తిరిగి వెళ్లిపోయింది.

నక్క వెళ్లిపోగానే కుందేలు లేచి గోతం భుజాన వేసుకుని ఇంటికి పోయి, అందులో ఉన్న పక్షులనన్నిటినీ వదిలేసింది.

తాను మొదట చూసిన కుందేలు ఎంత వెతికినా నక్కకు కనిపించలేదు. నక్క తన గోతంకోసం వచ్చి చూసుకుంటే అదికూడా పోయింది. నక్క కాళ్లీడ్చుకుంటూ కొంప చేరుకున్నది.

తరవాత కుందేలు నక్కను కలుసుకున్నప్పుడు, "ఏం, నక్కబావా? నువు వేటకు వెళ్ళొచ్చావుగామాలు, ఏం పట్టు కొచ్చావు? నాకూడా ఏదన్నా ఇస్తావను కున్నానే?" అన్నది.

నక్క మొహం చిట్లిస్తూ, "ఏమీ పట్టుకు రాకేం? ఇంత ఇంగితజ్ఞానం తెచ్చు కున్నాను!" అన్నది.

"ఓస్, ఇంతేనా? ఈ భాగ్యానికి వేటకు పోవాలా? నన్నడిగితే నేనే ఇద్దునే!" అన్నది కుందేలు.






## 7

[పింగళుడు పాడుదేవళంలోని, మొదటి ద్వారాన్ని దాటి రెండవ ద్వారం సమీపించి, అక్కడి పర్వతాకారుడికి తను ఎవరైందీ చెప్పి, ఆ ద్వారాన్నికూడా అధిగమించాడు. కాని ఆరవ ద్వారం దగ్గిర మాయాపద్మపాదుడి రూపంలో వున్న రక్కసివల్ల అతడికి ప్రమాదం కలిగింది. అతడు దేవళంనుంచి గాలిలోకి విసరివేయబడ్డాడు. తరవాత— ]

పద్మపాదుణ్ణి చూడగానే పింగళుడికి ప్రాణం లేచివచ్చినట్టయింది. అతడు తనకిక ప్రాణభయం లేదని గ్రహించాడు. అంతలో పద్మపాదుడు, పింగళుణ్ణి కింద పడకుండా చేతులతో ఆదుకుని, మెల్లగా భూమిమీద నిలబెట్టాడు.

"పింగళా, ఏం జరిగింది? ప్రమాదకరమైన దెబ్బలేమీ తగలలేదుగదా?" అంటూ పద్మపాదుడు ఆదుర్దాగా ప్రశ్నించాడు.

"దెబ్బల మాట తరవాత చూద్దాం. ముందు ప్రాణాలతో బయటపడ్డాను. అంతే చాలు," అని, పింగళుడు వెనుదిరిగి పాడు దేవళంకేసి చూశాడు. అతడు చూస్తూండగానే, అంతవరకూ ఒక్క నీటిచుక్కకూడా లేకుండా యింకిపోయిన నది, బుస్సుమంటూ ఒక్కసారి జలంతో పొంగసాగింది.

పద్మపాదుడు, పింగళుడి భుజంమీద చేయి వేసి, "పింగళా, యీసారికి మనం ఓడిపోయాం. మహామాయుడి శిష్యులు తిరిగీ నదిని జలంతో నింపుతున్నారు. దేవాలయం కూడా అందులో మునిగిపోతుంది. అయినా, మనం కావాలనుకున్ననాడు, తిరిగీ నదీ




జలాన్ని యింకింపచేయుగలం. ముందు, నీ అనుభవాల సంగతేమిటో చెప్పు?" అన్నాడు.

పింగళుడు, తను మొదటి ద్వారం దాటి, ఆరవ ద్వారాన్ని సమీపించేవరకూ జరిగిన సంఘటనలన్నీ పద్మపాదుడితో చెప్పాడు.

"ఆ ఆరవ ద్వారందగ్గిర అంత తెలివి గల భూతం కావలి వుంటుందని నేననుకో లేదు. హఠాత్తుగా, మీ ఆకృతి అక్కడ కనిపించింది. 'ఆగు, ఆగు. నువ్వెవరివి?' అని నన్ను ప్రశ్నించిన కంఠస్వరంకూడా మీదే! నేను ఒక్క తృటికాలం సంశ యించాను. యీలోపల హఠాత్తుగా కళ్ళు మిరుమిట్లు కొలిపే గద ఒకటి మెరిసింది. నేను కళ్ళు మూసుకున్నాను. అంతే, నా వీపుమీదా, తలమీదా దభీదభీమని దెబ్బలు పడసాగినై. ఎవరివో బలమైన చేతులు నన్ను పడిసిపట్టుకుని, ఆకాశంలోకి విసరివేసినై. కింద పడకుండా, మీరు నన్ను పట్టుకుని, కాపాడారు," అన్నాడు పింగళుడు.

"అలాగా!" అంటూ పద్మపాదుడు కళ్ళెర్రచేసి, నదీజలంలో మునిగిపోతున్న పాడుదేవళంకేసి ఓసారి చూశాడు. "పింగళా! మహామాయుడి శిష్యులు యింత నీచానికి ఒడికట్టుతారని నేననుకో లేదు. నీ గురువునైన, నా ఆకృతిలో మాత్రమే వాళ్లు నిన్ను మోసపుచ్చగలిగారు. అంతకు ముందు వాళ్ళు నిన్ను భయ పెట్టేందుకు ప్రయోగించిన ప్రతి దుష్టశక్తినీ నువ్వు జయించావు. అది నాకు చాలా ఆనందం కలిగిస్తున్నది!" అన్నాడు.

పద్మపాదుడి మాటలు, పింగళుడికి చాలా వుత్సాహం కలిగించినై. అతడు పాడుదేవళంకేసి చూచి, "ఇప్పుడు చేయ వలసిందేమిటి? దేవాలయం మళ్ళీ నదీ గర్భంలో మునిగి పోతున్నది!" అన్నాడు.

"ఈ రోజుకు యింక మనం చేయ గలిగిందేమీ లేదు. నేటినుంచి మూడు రోజుల తరవాత మళ్ళీ పర్వదినం ఒకటి



రానున్నది. అనాడు తిరిగీ నీవు మహా మాయుడి సమాధిలో ప్రవేశించవచ్చు. అంతవరకూ మనం యిక్కడే వుండవలసి వుంది. యీలోపల మనకు కాలక్షేపం జరిగేందుకు..." అంటూ పద్మపాదుడు, చేత నున్న గదను గాలిలో తిప్పి, ఏదో మంత్రం పఠించాడు. మరుక్షణంలోనే, ఆ నిర్జన ప్రదేశాన ఒక ఎత్తయిన సుందర భవనం లేచి నిలబడింది.

ఆశ్చర్యంగా ఆ మాయాభవనంకేసి చూస్తున్న పింగళుడి చేయి పట్టుకుని, పద్మపాదుడు అతణ్ణి భవనంకేసి నడిపాడు. వారిద్దరూ భవన ప్రాంగణాన్ని సమీపించేంతలో, తక్కున ద్వారం తెరుచుకున్నది. అజానుబాహులైన యిద్దరు కాలదేహులు బయటికి వస్తూ పద్మపాదుడికీ, పింగళుడికీ నమస్కరించారు.

"పద్మపాదా, వీళ్లెవరు?" అన్నాడు పింగళుడు అనుమానంగా.

"వీళ్లు, మనకు యీ మూడు రోజులూ వినోదం కలిగించేందుకు వచ్చిన మాయా రక్కసులు. మనం యిక్కడ వూరికే గోళ్లు గిల్లుకుంటూ కూర్చోలేంగదా? యీ పిశాచమల్లులకు, కుస్తీ, కర్ర కత్తియుద్ధాలు పెట్టి వినోదిద్దాం!" అన్నాడు పద్మపాదుడు.




పింగళుడూ, పద్మపాదుడూ భవనంలో ప్రవేశించారు. వాళ్లిద్దరూ ఒక ద్వారంనుంచి, ఒక పెద్ద గదిలోకి ప్రవేశిస్తూండగా, పింగళుడికి అక్కడ అనేకమంది మల్లులూ, యోధులూ కసరత్తులు చేస్తూండటం కనిపించింది. అతడు వారికేసి చూస్తూ, "పద్మపాదా, వీళ్ళందరూ కలిసి మనకేమైనా హాని తలపెట్టరుగదా?" అన్నాడు.

"అలాంటి భయం నీకేమీ అవసరం లేదు!" అంటూ పద్మపాదుడు ముందుకు నడిచి, మొదట కనిపించిన కాలదేహులతో మెల్లిగా ఏమో చెప్పాడు. వాళ్ళు వెంటనే అక్కణ్ణించి హుటాహుటిగా వెళ్లిపోయారు.






పద్మపాదుడూ, పింగళుడూ ఆ పెద్ద గదిలో వున్న పట్టుపరుపుల మెత్తలకు అనుకుని కూర్చున్నారు. కొద్దిసేపట్లో వారిదగ్గిరకు, బంగారు పళ్ళేరాల్లో వివిధ భోజనపదార్థాలు పెట్టుకుని అపురూప సౌందర్యవతులైన కొందరు స్త్రీలు వచ్చారు. పింగళుడు వారిని చూస్తూనే, "పద్మపాదా! వీళ్లు గంధర్వ కాంతలా, లేక ఆ రూపాలు ధరించిన పిశాచినులా?" అని ప్రశ్నించాడు.

పద్మపాదుడు, 'ఉష్' అని పింగళుణ్ణి వారిస్తూ, "పింగళా, అంత పెద్దగా మాట్లాడకు. పిశాచినులు ఏమైనా అనుకోగలవు. మనకు దాస్యం చేసేందుకు వచ్చిన పిశాచినులనైనా సరే మనం కొంచెపరచటం మంచిదికాదు. వాళ్లను, యీ మూడు రోజులూ గంధర్వకాంతలుగానే సంభావిద్దాం!" అన్నాడు.

తరవాత పద్మపాదుడూ, పింగళుడూ భోజనాలు ముగించారు. అంతలో, కాలదేహులు యిద్దరూ కొందరు పిశాచమల్లులనూ, యోధులనూ అక్కడికి తీసుకువచ్చారు. వాళ్లు వివిధ రూపాలు ధరిస్తూ కుస్తీ, కత్తియుద్ధాలు చేసి, పింగళుడికీ, పద్మపాదుడికీ వినోదం కలిగించారు.

ఈ విధంగా మూడు రోజులు గడిచిపోయినై. నాలుగవనాడు పద్మపాదుడు, ఆ మాయాభవనాన్నీ, అందులో వున్న మాయారూపుల్నీ, తన మంత్రబలంచేత మాయంచేసి, యింతకు పూర్వం తను నదిదగ్గిర కూర్చుని, మంత్రం పఠించిన చోటుకు వెళ్లాడు.

పద్మపాదుడు యిప్పుడు నదీగర్భంలో మునిగిపోయివున్న పాడుదేవళంకేసి చేయి చూపుతూ, "పింగళా, నేను నదీజలాన్ని యింకింప చేస్తాను. యీసారి నువ్వు మహామాయుడి సమాధిలో ప్రవేశించేప్పుడు, తీసుకోవలసిన జాగ్రత్తలను గురించి నేను మళ్లీ చెప్పనవసరంలేదు గదా?" అన్నాడు.



"పద్మపాదా, అలాంటి అవసరం ఏమీ లేదు. లోగడ తిన్న దెబ్బల కణుతులు యింకా కరిగికూడా పోలేదు. నేను ఏం మరచి పోయినా, ఆ దెబ్బల బాధా, మీ రూపంలో నన్ను మోసగించిన, మహామా యుడి శిష్యుడి ముఖ కపాలికలూ మాత్రం మరవను! యీసారి వాడి అంతు తేలుస్తాను," అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు మంత్రం జపించి, కొద్ది సేపట్లోనే నదీజలాన్ని యింకింప జేశాడు. పింగళుడు, నిర్భయంగా పాడుదేవళపు మొదటి ద్వారాన్ని సమీపించి, బుసలు కొడుతున్న పాముపడగమీద చెయ్యివేశాడు. అది వెంటనే ప్రాణం వదిలి కింద పడి పోయింది. తక్షణం, తలుపుల వెనకనుంచి కర్ణకఠోరమైన ధ్వనితో ప్రశ్న వినబడింది.

"నా పేరు పింగళుడు! నేను అవంతీ నగరపు జాలరిని!" అంటూ పింగళుడు ధైర్యంగా తలుపులను నెట్టాడు. తలుపులు తెరుచుకున్నవి. పర్వతాకారంలో వున్న నల్లనివాడు కత్తి ఝుళిపిస్తూ ముందుకు వచ్చాడు. అతడు, పింగళుణ్ణి మెడ చాచ మనటం, పింగళుడు మెడ చాచటం— పర్వతాకారుడు దభీమంటూ పడిపోవటం- అంతా పూర్వ పద్ధతిగానే జరిగింది.




పింగళుడు, ఒక్కొక్క ద్వారాన్నే దాటి, చివరకు ఆరవ ద్వారాన్ని సమీపించేంతలో, ద్వారంపక్కనే, పింగళుడి తల్లి కళ్ల నీళ్లు కారుస్తూ, "నాయనా, ఎందుకు వచ్చిన శ్రమ. వెనుదిరిగి పో! ఆ పద్మపాదుడు నిన్ను హతమార్చాలని చూస్తున్నాడు," అన్నది దీనాతిదీనంగా.

పింగళుడు నివ్వెరపోయాడు. అ వెంటనే అతడికి గత అనుభవం గుర్తుకు వచ్చింది. లోగడ తనను పద్మపాదుడి రూపంలో మోసగించిన పిశాచమే, యిప్పుడు తన తల్లిరూపం ధరించి మాయచేయ చూస్తున్న దని అతడు నిర్ణయించుకున్నాడు.




"దారితొలుగు. నువెవ్వరో నాకు తెలుసు! నా తల్లిరూపం ధరించినా, నన్ను మోసగించలేవు!" అంటూ పింగళుడు ద్వారంపక్కన వున్న కత్తినొకదానిని తీసుకుని ముందుకురికాడు. మాయారూపంలో వచ్చిన పిశాచి కెవ్వున కేకవేసి, వెంటనే మాయమయింది.

పింగళుడు పెద్దగా నవ్వి, కత్తిని దూరంగా గిరివాటువేసి ద్వారం దాటాడు. ఎదురుగా పట్టుతెరలు గాలికి రెపరెపలాడుతూ కనిపించినై. సన్నని ఆ తెరల వెనకనుంచి కాంతులు వెదజల్లుతున్న ఉన్నతాసనం ఒకటి కనిపించింది.



పింగళుడు పట్టుతెరలు తొలగించుకుని లోపలకు వెళ్లాడు. రత్నమాణిక్యాల కాంతిలో దేదీప్యమానంగా వెలిగిపోతున్న సింహాసనంమీద మహామాయుడు యోగ నిద్రలో వున్నట్టు కళ్లు మూసుకుని కూర్చుని వున్నాడు. పింగళుడికి, ఓ క్షణకాలం మహామాయుడు సజీవుడేమో అన్న అనుమానంకూడా కలిగింది. అతడు గాలి పీల్చుకునేందుక్కూడా వెరిచి, అడుగులో అడుగు వేసుకుంటూ మహామాయుణ్ణి సమీపించాడు. అతడి దృష్టి, మహామాయుడి కుడిచేతి వేళ్లమీదకు పోయింది. అక్కడ, కాంతికిరణాలను వెదజల్లుతున్న అతడి వేలి వుంగరం పింగళుణ్ణి ఆకర్షించింది.

పింగళుడు, నిర్భయంగా, మహామాయుడి కుడిచేతి వేలినుంచి వుంగరాన్ని వూడదీశాడు. ఇంక తనకు కావలసినవి రెండు వస్తువులు!. వజ్రాలు తాపిన పిడిగల కత్తి, మహామాయుడి నడుముకు వేలాడ కట్టబడి వుంది. పింగళుడు దాన్ని వరతో కూడా తీసుకుని తన నడుముకు బిగించుకున్నాడు. ఇక, కావలసింది; భూగోళం!

పింగళుడు, నలువైపులా కలయ చూచాడు. అతడికి ఒక మూలగా మెట్లు కనిపించినై. ఆ మెట్లకు దిగువగా, ఒక



ఎత్తయిన బల్లమీద గుండ్రని చంద్రబింబంలా మెరుస్తూన్న భూగోళం కనిపించింది. పింగళుడు దాన్ని సమీపించి గోళంలోకి చూశాడు. అందులో, వివిధ దేశాలూ, వాటి సరిహద్దులూ, పనిపాట్లలో మునిగివున్న ఆయా దేశ ప్రజలూ, అతడి దృష్టికి స్పష్టంగా కనిపించారు.

మహామాయుడి సమాధినుంచి తను సంగ్రహించవలసిన మూడు వస్తువులూ పింగళుడికి లభించినై. అతడు భూగోళాన్ని భద్రంగా అందుకుని భుజంమీద పెట్టుకుని, ఆఖరిసారిగా మహామాయుడు కూర్చునివున్న సింహాసనానికేసి చూసి, బయటికి బయలుదేరాడు.

పింగళుడు, మహామాయుడి సమాధి గదినుంచి బయటికి నడిచేంతలో, ఎక్కడినుంచో చెవులకు విందుచేసే చక్కని గానం వినబడింది. "భేష్, పింగళా! నీ ధైర్యసాహసాలూ, తెలివితేటలూ మా అందరి మెప్పునూ పొందినై!" అన్న మృదువైన కంఠస్వరం, పింగళుడికి వినబడింది. ఆ కంఠస్వరం మహామాయుడిదేమో అనుకుని పింగళుడు వెనుదిరిగి చూశాడు. కాని, మహామాయుడిలో ఏమీ చలనం లేదు.

పింగళుడు అన్ని ద్వారాలూ దాటి బయటికి రాగానే, పద్మపాదుడు వుత్సాహంగా చప్పట్లు చరిచి, "పింగళా, మనం జయించాం! ఇక, యీ ప్రపంచంలో మన శక్తికి తిరుగులేదు," అంటూ ముందుకు పరిగెత్తుకుంటూ వచ్చాడు. అదే సమయంలో, నదీగర్భంనుంచి అగ్నిపర్వతం బద్దలయినట్టుగా పెద్ద ధ్వని వినబడింది. మరుక్షణం, తాటిచెట్టు ప్రమాణంలో నీటిధార ఒకటి భూమిలోంచి లేచింది. పద్మపాదుడు, దానిని చూస్తూనే అదురుకుని, వెనక్కు ఒక గంతువేశాడు.

(ఇంకా వుంది)



# నక్కా — తాబేలు

ఒకనాడు ఒక నక్కకు ఎంత వెదికినా ఆహారం దొరకలేదు. అది కాలుకాలిన పిల్లిలాగా తిరుగుతుండగా దానికొకచోట ఒక వింత జంతువు మెల్లిగాపోతూ కనిపించింది. ఆ జంతువు తాబేలు. నక్క దానిమీద దూకి తోక పట్టుకుని, చంపి తిందామనే ఉద్దేశంతో దాని వీపుమీద గట్టిగా కరిచింది.

తాబేలు వీపుమీద డిప్ప చాలా గట్టిగా ఉండటంచేత నక్క కాలు నొప్పి పుట్టిందేతప్ప తాబేలుకు ఈగ వాలినట్టుకూడా లేదు.

తాబేలు నక్కను గుర్తించి, "ఎందుకు నన్ను పట్టుకుని కొడుతున్నావు?" అని అడిగింది.

"నిన్ను చంపితినాలి. నీవీపు ఇంతగట్టిగా ఉందేమిటి?" అన్నది నక్క.

"నన్ను దేవుడు అట్లా పుట్టించాడు. నన్ను నీటిలో ముంచితేతప్ప చావను. నీ కదికూడా తెలీదా?" అన్నది తాబేలు.

వెంటనే నక్క తాబేలును తోక పట్టుకుని దగ్గిరే ఉన్న నదిలో ముంచి, కొంచెంసేపయాక, "చచ్చిపోయావా?" అని అడిగింది.

"అయ్యో, అయ్యో! చచ్చిపోతున్నాను. నన్ను తోక పట్టుకుని పైకి లాగు. ఆ వేరును పట్టుకున్నావేమిటి?" అన్నది తాబేలు.

తాను పట్టుకున్నది ఏదో చెట్టువేరు కాబోలనుకుని నక్క తాబేలు తోకను వదిలి వేసింది. మరుక్షణం తాబేలు నదిలోకి ఈదుకుంటూ వెళ్లిపోయింది.



# గర్భశత్రువులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివచ్చి, శవాన్ని దింపి భుజాన వేసుకుని, మౌనంగా మళ్ళీ శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు ఇంకొకరికోసం శ్రమపడటంలో ఆశ్చర్యం ఏమీ లేదని చెప్పవచ్చు. ఎందు చేతనంటే, పూర్వం మణిమంతుడనే వాడు తన గర్భశత్రువైన ప్రదీపుడి కోసం మూడు మాసాలపాటు అహోరాత్రులు శ్రమ పడ్డాడు. వారి కథను చెబుతాను, విను!" అంటూ ఈ కింది కథ చెప్పాడు:

పూర్వం అంగదేశానికీ, విదేహ దేశానికీ మధ్య ప్రబలమైన శత్రుత్వం ఉండేది. రెండు దేశాల మధ్యా ఎడతెగక యుద్ధాలు సాగుతూ ఉండేవి. ఇలా జరిగిన ఒక భయంకరమైన యుద్ధంలో విదేహ పూర్తిగా ఓడిపోయి అంగరాజుకు వశమైపోయింది. విదేహ రాజకుటుంబం దేశాంతరాలు పట్టి



పోయింది. అంగరాజు కింద సేనాపతిగా ఉండిన మణిమంతుడు విదేహకు రాజుగానూ, అంగరాజుకు సామంతుడుగానూ పట్టం కట్టుకున్నాడు.

యుద్ధంలో విదేహదేశపు సేనాపతి వీరమరణం పొందాడు. ఆయన కుమారుడు ప్రదీపుడనేవాడు సమీపంలో ఉండిన ఎడారిలోగల కొండలలో తలదాచుకున్నాడు. ప్రదీపుడితోబాటు మరి కొందరు క్షత్రియ యువకులు కూడా కొండలలో తమ నివాసం ఏర్పాటు చేసుకుని, తమదేశాన్ని విముక్తం చెయ్యటానికి ప్రాణాలను ధారపోస్తామని ప్రతిజ్ఞచేశారు. వారు ప్రదీపుణ్ణి తమ నాయకుడుగా ఎన్నుకున్నారు.

కాని మణిమంతుణ్ణి యుద్ధంలో జయించే అవకాశాలు వారికి లేవు. వారివద్ద కత్తులు తప్ప వేరే ఆయుధాలు లేవు. యువకులందరూ కలిసి పది పదిహేను మందికి మించరు. అటువంటి సందర్భంలో మణిమంతుణ్ణి జయించటం మాటలా? మణిమంతుడికి చతురంగ బలాలున్నాయి, అంతులేని ఆయుధాలున్నాయి.

"మనకు సైన్యం లేదనీ, ఆయుధాలు లేవనీ చేతులు కట్టుకు కూచుంటే మన ప్రతిజ్ఞ నెరవేరదు. ధర్మయుద్ధం చెయ్యలేకపోతే అధర్మయుద్ధమైనా చేసి, మనం శత్రువును నాశనం చెయ్యాలి!" అని ప్రదీపుడు తన మిత్రులను హెచ్చరించాడు.

అతని నాయకత్వం కింద యువకులు అధర్మయుద్ధం ప్రారంభించారు. అంగకూ విదేహకూ మధ్య బిడారులు వస్తూ పోతూ ఉండేవి. ప్రదీపుడి ముఠావాళ్లు వాటిని కొల్లగొట్టే వారు. ఎడారిమధ్య కొండలలో వుండే ఆ యువకులు ఆహారం సంపాదించటాని కింతకన్న మరొక మార్గంలేదుకూడా.

వాళ్ళు చీకటి రాత్రులప్పుడు విదేహ నగరం ప్రవేశించి మణిమంతుడి తాలూకు మనుషు లెవరైనా చిక్కితే హత్యచేస్తూండే

వారు. ఒక రాత్రి ఈ విధంగా వారు మణి మంతుడి కుమారు లిద్దరిని చంపేశారు.

ప్రదీపుడి ముఠావాళ్ళు చేసే దారుణ కృత్యాలను మణిమంతుడు ఇంతవరకూ చూసీ చూడనట్టు ఊరుకున్నాడు. తాము చేసే పని అతినీచమైనదని వారికే తెలిసి వస్తుందని ఆయన నమ్మాడు. కాని వారు తన కుమారులను అధర్మంగా, పిరికి పంద లల్లే చంపేసే సరికి ఆయనకు పట్టరాని ఆగ్రహం వచ్చింది.

మణిమంతుడు తన కింద ఉండే సరదార్లలో సమర్థుడైన వాణ్ణి పిలిచి, "ఏమోయి, నీవు కొంత బలాన్ని వెంట పెట్టుకువెళ్ళి కొండలలో ఉండే ముఠాను హతమార్చి తిరిగిరా! ఒక్క ప్రదీపుణ్ణి మటుకు ఎట్టి పరిస్థితిలోనూ చంపవద్దు. జననష్టం జరిగినాసరే అతన్ని ప్రాణాలతో పట్టి తీసుకురా?" అని హెచ్చరించాడు.

సరదారు ఆప్రకారమే ఒక వందమంది సైనికులను వెంటబెట్టుకుని ప్రదీపుడి ముఠా ఉండే కొండలకేసి బయలుదేరాడు. అతి కష్టంమీద ఈ సైనికులు ప్రదీపుడి ముఠా ఉండే రహస్య ప్రాంతం కనిపెట్టి చుట్టు ముట్టేశారు.

"ఇది ఆఖరి పోరాటం! ప్రాణాలకు తెగించి పోరాడండి! శత్రువులకు మాత్రం



లొంగకండి!" అని ప్రదీపుడు తన అనుచరులను హెచ్చరించాడు. వారుకూడా, ఒక్కొక్కడూ పదిమంది పెట్టుగా పోరాడి, మణిమంతుడు పంపిన సైనికులలో సగానికి పైగా హతమార్చి చివరకు తామూ చనిపోయారు. ప్రదీపుడు ఒక్కడే మిగిలాడు.

కాని అతన్ని ప్రాణాలతో పట్టుకోవటం సరదారుకు చాలా శ్రమ అయింది. అతను అసలే గొప్ప వీరుడు, ఆపైన ప్రాణాలకు తెగించి ఉన్నాడు.

చివరకు సరదారు వెనుకపాటున ప్రదీపుడి తలపై బలంగా కొట్టి, స్పృహతప్పి పడిపోయేలాగా చేశాడు. ఆ రాత్రే ప్రదీపుణ్ణి మణిమంతుడివద్దకు చేర్చారు. అతను చావలేదన్న మాటేగాని చాలా అపాయస్థితిలో ఉన్నాడు. రాజవైద్యుడు అతన్ని పరీక్షచేసి, బతకటం కష్టమని చెప్పాడు.

"అలా కాదు! ఈ కుర్రవాడు బతికి తీరాలి! నీశక్తి యావత్తూ వినియోగపరచి ఇతని ప్రాణాన్ని కాపాడు!" అన్నాడు మణిమంతుడు.

వైద్యుడు అహోరాత్రాలు రోగి పక్కనే ఉండి చికిత్సచేశాడు. వారం రోజులపాటు ప్రదీపుడికి స్పృహలేదు. ఆ తరవాత మరి మూడు వారాలపాటు స్పృహ వచ్చినట్టే వచ్చి మళ్ళీ పోతూండేది.





ఒక నెల గడిచాక, "ఇక భయంలేదు. ఈ కుర్రవాడు మళ్ళీ బతుకుతాడు!" అని రాజవైద్యుడు మణిమంతుడికి ధైర్యం చెప్పాడు. ఈ నెల రోజులూ వైద్యుడికిగాని, మణిమంతుడికిగాని నిద్రాహారాలు లేవు.

ప్రదీపుడు బతుకుతాడనగానే మణిమంతుడి ఆనందానికి మేరలేదు. స్పృహ తెలిసి, మణిమంతుణ్ణి గుర్తుపట్టగానే ప్రదీపుడు ఆశ్చర్యపోయి, "మీరా?" అన్నాడు.

"అవును, నాయనా! నేనే! నీకేమీ భయంలేదు. నువు తిరిగి కోలుకోవటానికి నేను ఎంత త్యాగమైనా చేస్తాను!" అన్నాడు మణిమంతుడు.

అందులో అతిశయోక్తి ఏమీ లేదు. ఎందుచేతనంటే మణిమంతుడు ఎప్పుడూ ప్రదీపుడి పక్కవద్దనే ఉండి, అతనికి కావలిసిన పరిచర్యలన్నీ చేసేవాడు. తన చేత్తోనే అతనికి ఆహారం పెట్టేవాడు. ప్రదీపుడికి స్వస్థత చేకూరటానికి వైద్యంకన్న కూడా, మణిమంతుడి ఉపచారాలే ఎక్కువగా తోడ్పడ్డాయి.

ప్రదీపుడు నడక దగ్గిరనుంచీ మళ్ళీ నేర్చుకోవాలిసి వచ్చింది. మణిమంతుడు అతన్ని పట్టుకుని ప్రతిరోజూ తోటలో నడిపించేవాడు. పట్టుకోకుండా నడిచేస్థితి వచ్చినాక, ఒకనాడు మణిమంతుడు, "గెంతగలవా, నాయనా?" అన్నాడు. ప్రదీపుడు ప్రయత్నించాడుగాని గెంతలేక పోయాడు.

మూడు నెలలు గడిచాయి. రోజూ అడుగుతున్నట్టే మణిమంతుడు ప్రదీపుణ్ణి, "గెంతగలవా, నాయనా?" అని అడిగాడు.

"ఓ!" అంటూ ప్రదీపుడు కొంతదూరం పరిగెత్తి, చాలాదూరం గెంతాడు.

"భేష్! నువ్విక్కడే ఉండు. నే నిప్పుడే వస్తాను!" అంటూ మణిమంతుడు భవనంలోకి వెళ్ళిపోయాడు. ఆయన ఉద్దేశమేమిటో తెలియక, ప్రదీపుడు ఆశ్చర్యపడుతూ అక్కడే నిలబడ్డాడు.

కొద్దిసేపట్లోనే మణిమంతుడు తిరిగి వచ్చాడు. ఆయన చేతిలో రెండు కత్తు లున్నాయి.

"ఇవి దేనికి?" అన్నాడు ప్రదీపుడు.

"మనిద్దరమూ ద్వంద్వ యుద్ధం చెయ్యటానికి!" అన్నాడు మణిమంతుడు. అయన కళ్ళు చింతనిప్పుల్లాగా ఉన్నాయి.

"ద్వంద్వ యుద్ధమా? దేనికి?" అన్నాడు ప్రదీపుడు.

"నువ్వు నా గర్భ శత్రువువు! నా కొడుకు లిద్దరినీ చాటుగా చంపావు! నేను నిన్ను ధర్మయుద్ధంలో చంపుతాను! ఈ అవకాశం కోసమే నిన్ను మృత్యువునోటినుంచి కాపాడాను! ఇప్పుడు నా పగ తీర్చుకునే అవకాశం వచ్చింది!" అన్నాడు మణిమంతుడు.

ఆయన అందించిన కత్తిని ప్రదీపుడు నిరాకరించి, తలవంచుకు నిలబడ్డాడు.

"కత్తి తీసుకో! ఇదివరకల్లా పిరికిపంద లాగా యుద్ధం చేశావు! కనీసం వీరుడు లాగా చచ్చిపో! నాతో యుద్ధం చెయ్యక నువు తప్పించుకోలేవు!" అంటూ మణిమంతుడు అతని చేతిలో కత్తిపెట్టాడు.

ప్రదీపుడికి మతి మతిలో లేదు. మణిమంతుడు కత్తిఎత్తి తనపైకి వచ్చినప్పుడు అతను అప్రయత్నంగా తన కత్తి ఎత్తి



ఆత్మరక్షణ చేసుకున్నాడు. అతను ఆత్మరక్షణకోసం పోరాడాడుగాని, మణిమంతుణ్ణి గాయపరచటం అతని కెంతమాత్రమూ ఇష్టం లేదు.

అయినప్పటికీ కొద్ది సేపట్లోనే ప్రదీపుడి కత్తి మణిమంతుడి గుండెను చీల్చేసింది. వెంటనే ప్రదీపుడు తన కత్తిని అవతల పారేసి, తండ్రిని కోల్పోయిన పిల్లవాడి లాగా ఏడ్చాడు.

మణిమంతుడు చావగానే విదేహ ప్రజలకు చైతన్యం వచ్చినట్టయింది. వారు ప్రదీపుణ్ణి తమ రాజుగా ఎన్నుకుని అంగ దేశపు బలాలను తన్ని తరిమారు. ప్రదీ

పుడు మణిమంతుడి కుటుంబానికి గొప్ప జాగీర్లు ఇచ్చి తన రుణం తీర్చుకున్నాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకొకటే సందేహం. ధైర్యంలోనూ, ఔదార్యంలోనూ ఎవరు గొప్పవాడు? తన గర్భశత్రువు ప్రాణాలను కాపాడి ధర్మయుద్ధంలో జయించటానికి ప్రయత్నించిన మణిమంతుడా? అధర్మ యుద్ధంలో మణిమంతుడి కొడుకులను హత్యచేసి, ధర్మయుద్ధంలో మణిమంతుడితో పోరాడటానికి వెనకాడిన ప్రదీపుడా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది!" అన్నాడు.

"సందేహానికి ఎటువంటి తావులేదు! ధైర్య పరాక్రమాలలోను, ఔదార్యంలోనూ కూడా మణిమంతుడికన్న ప్రదీపుడే గొప్పవాడు. అతను అధర్మయుద్ధం చేశాడంటే అది దేశభక్తితో మాత్రమే చేశాడు. ధర్మయుద్ధానికి అవకాశంలేని పరిస్థితిలోనే ఆ పని చేశాడు. మణిమంతుడికన్నా అతను గొప్పయోధుడని ఆఖరు పోరాటంలో రుజువు కానే అయింది. మణిమంతుడి ఔదార్యం చాలా కపటమైనది. ప్రదీపుణ్ణి ద్వంద్వ యుద్ధంలో సులువుగా చంపగలనని అనుకోవటంవల్లా, విదేహదేశ ప్రజలకు తాను ధర్మబుద్ధి గలవాడుగా కనబడాలనే ఉద్దేశంతోను ఆయన ప్రదీపుడికి సేవచేశాడు. అతను తనకన్న గొప్ప యోధుడై ఉండవచ్చునని మణిమంతుడికి తట్టలేదు. ప్రదీపుడుకూడా మణిమంతుడి ఔదార్యం నిజమైనదనే నమ్మాడు. అది నిజమైన ఔదార్యం కాదని తెలియగానే అతనికి మతి పోయినట్టయింది. అందుచేత మణిమంతుడికన్న ప్రదీపుడే అన్నివిధాలా గొప్పవాడు," అని విక్రమార్కుడు చెప్పాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# ప్రతిక్రియ

కైరోనగరంలో మన్సూర్ అనే యువకుడుండేవాడు. అతను ఒకసారి రెండు బుల్‌బుల్‌పిట్టలను పట్టుకుని, వాటిని ఒక పంజరంలో పెట్టి తన ఇంటిబయట వేలాడగట్టాడు. ఆ పిట్టలు తమ పాటతో దారే పోయేవారికి ఆనందం కలిగించసాగాయి. చాలామంది అక్కడ ఆగి, కొంచెంసేపు పాట విని సాగిపోయేవారు.

ఇంతలో ఆ దారిన ఒక అధికారి వచ్చాడు. ఈయన ఖలీఫాగారి అంగరక్షకులకు పెద్ద. ఈయన పేరు అబూసేఫ్. కాని ఆయన పరమ దుర్మార్గుడూ, కఠిన హృదయుడూ కావటంవల్ల ఆయనను కైరోనగర వాసులందరూ "సైతాను కొడుకు" అంటూండేవారు.

అబూ ఆగి బుల్‌బుల్ పిట్టల పాట విన్నాడు. తరవాత మన్సూర్ ఉండే ఇంట్లో ప్రవేశించి, "రెండు దిరాములిస్తాను, బయట ఉండే పిట్టలను అమ్ముతావా ?" అని అడిగాడు.

"అవి అమ్మేవి కావు!" అని మన్సూర్ జవాబు చెప్పాడు.

అబూ క్రమంగా బేరం పెంచి, చిట్టచివరకు రెండు బంగారు దీనారాలిస్తానన్నాడు. అప్పుడు మన్సూర్ పిట్టలను అమ్మటానికి ఒప్పుకున్నాడు.

"నేను నేరుగా ఇంటికే పోతున్నాను. పంజరం తీసుకుని నావెంట వచ్చి, డబ్బు పుచ్చుకు పో!" అన్నాడు అబూ.

ఇద్దరూ కలిసి అబూ ఇల్లు చేరారు. అబూ మన్సూర్‌వద్దనుంచి పంజరం తీసుకుని ఇంటిలోపలికి పోతూ, "నువ్వు, ఇక్కడే ఉండు, నీకు రావలిసిన డబ్బు ఇప్పుడే పంపిస్తాను," అన్నాడు.

మన్సూర్ చాలాసేపు వేచివుండి వాకిలి తలుపు తట్టాడు. సిపాయి ఒకడు తలుపు

ఏ. వీరభద్రరావు

తెరిచి, "ఏం కావాలి? ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"ఈ ఇంటి యజమాని పేరు నాకు తెలియదు. ఆయన నాకు రెండు దీనా రాలు బాకీ ఉన్నారు," అన్నాడు మన్సూర్.

"ఆయన పేరు అబూ. అందరూ ఆయ నను సైతాను కొడుకని పిలుస్తారు. ఆయన ఎవరికీ బాకీ ఉండరు! అలా జరగటానికి వీల్లేదు!" అన్నాడు సిపాయి.

మన్సూర్‌కు చిరాకు వచ్చింది. "సైతాను కొడుకైతే నాకేం? సైతాను తండ్రి అయితే నాకేం? నా బుల్‌బుల్ పిట్టలను రెండు దీనారాలకు బేరంచేసి కొన్నాడు. నా డబ్బు నాకు పారెయ్యమను. లేదా, నా పిట్టలను నాకిచ్చెయ్యమను!" అన్నాడు.

"అబ్బాయీ, పాముతో చెలగాటాలాడకు! మా యజమానికి ఆగ్రహం తెప్పించావంటే నీ ప్రాణాలు దక్కవు. ఆయనను చూసి హడలిపోనివారు ఈ కైరోనగరంలో లేరు. కనక, అయిందేదో అయిపోయింది, నీ దారిన నువ్వు వెళ్ళు! లేకపోతే చిక్కున పడిపోగలవు!" అన్నాడు సిపాయి

"నాకు లేని భయం నీకేమిటి? మీ యజమానిని ఒకసారి బయటికి రమ్మను. ఆయనతో నేనే తేల్చుకుంటాను!" అన్నాడు మన్సూర్ నిర్లక్ష్యంగా.







"చిత్తం, తమరు ఒక గంట క్రితం నాదగ్గిర రెండు బుల్‌బుల్ పిట్టలు కొన్నారు. నా రెండు దీనారాలు నాకిప్పించండి. లేదా, నా పిట్టలను నాకిస్తే వెళ్ళిపోతాను," అన్నాడు మన్సూర్.

"నీకు డబ్బివ్వాలిరా, గాడిదా? వెంటనే బయటికి పోకపోతే చీల్చేస్తాను. పో బయటికి!" అని అబూ గర్జించాడు.

మన్సూర్ చెయ్యగలిగినదేమీ లేదు. ఈ అన్యాయానికి తప్పక ప్రతిక్రియ జరపాలని నిశ్చయించుకుని అతను మారుమాట్లాడకుండా తన ఇంటికి వెళ్ళిపోయాడు.

సిపాయి క్షణంసేపు నివ్వెరపోయి, మన్సూర్ సంగతి తన యజమానితో చెప్పటానికి లోపలికి వెళ్ళాడు. మన్సూర్‌కూడా అతని వెనకే బయలుదేరాడు.

సిపాయి చెప్పినదంతా విని అబూ కోపంగా, "వాడికెంత కావరం! లోపలికి పంపించు, వాడి అంతు ఇప్పుడే తేలుస్తాను!" అన్నాడు.

"నేనిక్కడే ఉన్నాను, హుజూర్!" అంటూ మన్సూర్ చాటునుంచి ముందుకు వచ్చి అబూకు ఎదురుగా నిలబడ్డాడు.

"నీకిక్కడ ఏం పని?" అని అబూ గద్దించాడు.

అబూ ఇంటికి కొద్ది దూరంలో పెద్ద బావి ఒకటున్నది. చుట్టుపక్కల ఉండే ఆడవాళ్ళు అందులో నీళ్ళు చేదుకుంటారు. మన్సూర్ ఆడపిల్లవేషం వేసుకుని, మేలిముసుగుతో ముఖం కప్పుకుని కొయ్యచేద తీసుకుని ఆ బావివద్దకు వెళ్ళి, అబూ అటుగా వచ్చేదాకా అక్కడే తారట్లాడాడు. తన శత్రువు కనుచూపుమేరలోకి రాగానే మన్సూర్ చేదను దభాలున బావిలో పడవేసి, "అయ్యో, కొత్త చేద! బావిలో పడిపోయింది! నన్ను చంపేస్తారు! ఏం చేసేది?" అంటూ ఆడగొంతుతో శోకాలు పెట్టటం సాగించాడు.



ఒంటరిగా ఎవతో బావివద్ద ఏడుస్తూ ఉండటం చూసి, అబూ దగ్గిరికి వచ్చి, " ఏమిటి ? ఏం జరిగింది ?" అన్నాడు.

మన్సూర్ బావిలోకి వంగి చూస్తూ, " అదుగో ! నా చేద !" అన్నాడు.

అబూకూడా బావిలోకి వంగి చూడ సాగాడు. మరుక్షణం మన్సూర్ అబూ కాళ్లు రెండూ ఎత్తి, ఆ దుర్మార్గుణ్ణి బావిలోకి తోసేసి తనదారిన తాను ఇంటికివెళ్లి, అప్పటి కప్పుడే తన మకాం నగరంలోని ఇంకొక పేటకు మార్చాడు.

అబూ బావిలో పడి చావలేదు, ఎందు కంటే బావి అటే లోతు లేదు. బావిలో పడ్డప్పుడు శరీరం అక్కడక్కడా కొట్టుకు పోయి గాయాలుమాత్రం అయాయి. కాని అతను బావిలోనుంచి పైకి రాలేక, "నన్ను పైకి లాగండి !" అని పెద్దపెట్టున కేకలు వెయ్యా సాగాడు.

నీళ్లు తోడుకోవటానికి బావిదగ్గిరికి వచ్చిన అడవాళ్లు ఈ కేకలు విని కంగారుపడ్డారు. కాని తొంగిచూస్తే ఆ లోతుబావిలో ఎవ రున్నదీ తెలియరాలేదు.

వాళ్లు బావిలోకి వంగి, " ఎవరు నువు ? సైతానువా? వాడి కొడుకువా?" అని భయ పడుతూ అడిగారు.



తనను ఆ స్త్రీలు గుర్తించారని ధైర్యం కలిగి అబూ, " నేను సైతాను కొడుకును !" అని జవాబు చెప్పాడు.

అడవాళ్లకు ఎంతో కంగారు కలిగింది. వాళ్లు ఒక లావుపాటి రాయిఎత్తి బావిలో వేస్తూ, " నువు అందులోనే పడి చావు !" అని కేకలుపెట్టి, నీళ్లు తీసుకోకుండానే వచ్చినదారిన తిరిగి వెళ్లిపోయారు.

అదృష్టవశాత్తూ ఆ రాయి అబూ నెత్తిన పడ లేదు.

ఆ బావిలో సైతాను చేరిందనీ, అందులో ఎవరూ నీళ్లు తోడుకోరాదనీ ప్రచారం జరి గింది. అడవాళ్ల మధ్య జరిగిన ఈ ప్రచారం

మగవాళ్లదాకా వెళ్లింది. ఈ వింత ఏమిటో చూద్దామని వాళ్లు బావిదగ్గిరికి వెళ్లారు.

ఆ మగవాళ్ల సహాయంతో అబూ, చావు తప్పి కన్నులొట్టబోయి, బావినుంచి బయట పడ్డాడు. ఆయనను నలుగురూ చేరి, డోలీలో వేసుకుని ఇంటికి చేర్చారు.

అబూ శరీరంనిండా గాయాలతో చాలా బాధపడ సాగాడు. తెల్లవార్లూ నిద్రలేదు. వైద్యులు వచ్చి మందు లిచ్చారుగాని ఫలితం లేకపోయింది.

మన్సూర్ ప్రయత్నం కొనసాగలేదు; అబూ బతికి బయట పడ్డాడు. అతని పగ తాచుపాము పగేనని మన్సూర్ ఎరుగును. అటువంటివాణ్ణి చంపలేకపోయినట్టయితే వాడిచేత చావు తప్పదు! అందుచేత తాను ఏదో ఒకటి చేసితీరాలి!

మన్సూర్ ఒక ముసలిహకీమ్ వేషం వేసుకుని, గూనీ తెల్లగడ్డమూ పెట్టుకుని, ఏవేవో మందులు మూటగట్టుకుని, అబూ ఇల్లుండే వీధికేసి వెళ్లాడు.

అబూ నౌకర్లు అతన్ని ఆపి. "హకీమ్ గారూ, మా యజమాని తీవ్రంగా బాధపడు తున్నారు, తమరు చికిత్సచేయగలరా?" అని అడిగారు.

"ఎటువంటి వ్యాధులకైనా చికిత్స చేస్తాను!" అన్నాడు మన్సూర్.



నౌకర్లు అబూపద్దకు వెళ్లి హకీమ్ సంగతి చెప్పారు. అతనికి గూని ఉన్నదని తెలియ రాగానే అబూకు ఈ హకీమ్‌మీద గురి కుదిరింది. ఏవో అవలక్షణా లున్నవాళ్లకి తెలివితేటలు చాలా హెచ్చుగా ఉంటాయని అతని నమ్మకం.

మన్సూర్ లోపలికి వచ్చి రోగిని పరీక్షించి నట్టు నటించి ఏదో కషాయం కాయించి అబూను తాగమన్నాడు.

ఆ కషాయం తాగగానే అబూకు వాంతులుకూడా ఆరంభమయాయి.

"ఇదేమిటి, హకీమ్‌గారూ?" అన్నాడు అబూ లబలబలాడుతూ.

"నేను చాలా మంచి మందిచ్చాను. నీ బుద్ధిలో ఏదో జాడ్యం ఉన్నది. లేక పోతే మందు వికటించదు. చెప్పు, నువు ఎవరిమీదనైనా పగపట్టావా?" అన్నాడు మన్సూర్.

వెంటనే అబూకు తన శత్రువు మన్సూర్ జ్ఞాపకం వచ్చాడు.

"పగ పట్టటమేమిటి? వాణ్ణి చిత్రవధ చేస్తేగాని నేను నిద్రపోను!" అన్నాడు అబూ పళ్లు కొరుకుతూ.

"అటువంటి ఆలోచనలు మానితేగాని ఈ వ్యాధి నయం కాదు!" అన్నాడు మన్సూర్ చిరాకు కనబరుస్తూ.



"నయమైనప్పుడే నయమవుతుంది. నేనుమాత్రం ఆ మన్సూర్‌ను ప్రాణాలతో వదిలేది కల్ల! వాడు నాకు ఎంత అవమానం చేశాడు! ఇంతవాణ్ణి, నన్నే ధిక్కరిస్తాడా?" అన్నాడు అబూ.

"ముందు నీ మనస్సు శాంతించటానికి మందు తయారుచెయ్యాలి!" అంటూ మన్సూర్ నౌకర్లనందరినీ తలా ఒక వస్తువూ తెమ్మని పంపేశాడు.

తరవాత అతను తన గడ్డమూ, గూనీ తీసేసి, "నేనే మన్సూర్‌ను. పిచ్చివేషాలు వెయ్యక నా డబ్బు నాకిచ్చెయ్యి! నా జోలికి వస్తే మర్యాద దక్కదు. నువ్వంటే నాకేమీ భయంలేదు!" అన్నాడు.

అబూ ఒళ్ళుతెలియని ఆవేశంతో లేచి ఆ నీరస స్థితిలోనే, పెద్దగా అరుస్తూ మన్సూర్‌మీద కలియబడ్డాడు.

మన్సూర్ నవ్వుతూ, "నన్ను నువు చంపేదేమిటి? నేను నీకు ఇదివరకే విషం ఇచ్చేశాను. ఇదుగో నాదగ్గిర విరుగుడు కూడా ఉన్నది. రెండువందల దీనారాలిస్తే నీకా విరుగుడు ఇస్తాను. లేకపోతే నీకు నూకలు చెల్లినట్టే! నువు ఇంకొక గంట కన్న బతకవు!" అన్నాడు.

అబూకు కంగారెత్తింది. అతను బాధపడుతూ వెళ్ళి రెండువందల దీనారాలూ తెచ్చి మన్సూర్ చేతిలో పెడుతూ, "విరుగుడు త్వరగా ఇయ్యి! లేకపోతే చచ్చిపోతాను!" అంటూ ఆయాసపడ్డాడు.

అబూ పిరికితనమూ, ప్రాణభయమూ చూసి మన్సూర్ తనలో తాను నవ్వుకున్నాడు. అతను తన జేబులోనుంచి ఒక సీసా తీసి అందులో ఉన్న మందును అబూ గొంతులో పోశాడు. అది తియ్యగా ఉండటం వల్ల అబూకు ధైర్యం వచ్చింది.

"ఇక నీకు ప్రాణభయం లేదు!" అంటూ మన్సూర్ రెండువందల దీనారాలూ పట్టుకుని వెళ్ళిపోయాడు.



# నావికుడు సింద్‌బాద్

ఇక నేను సముద్రయానాలు చేయ దలచలేదు. నాకు వయసు పైనబడుతున్నది. ఇంటి పట్టున ఉండా లనిపిస్తున్నది తప్ప, ఏళ్ల తరబడి దేశంకాని దేశాలలో ఉండటానికి మనసు ఇష్టపడటం లేదు. ఒక జన్మకి పడదగినన్ని కష్టాలు పడ్డాను, ఇక చాలు. బాగ్దాద్ నగరంలో నాకంటె ధనికుడు లేడు. ఖలీఫా నన్ను అప్పుడప్పుడూ పిలిపించి నా అనుభవాలు వింటూండే వాడు.

ఒకనాడు ఇలాగే హారున్ అల్ రషీద్ నన్ను పిలిపించాడు. నేను నా సముద్రయానాల కథలు చెప్ప టానికి సిద్ధ మవుతుండగా, ఆయన నాతో, "సింద్‌బాద్, ఆ ఇథియోపియా రాజుకు నేను సమాధానం రాశాను. ఆయనకు కొన్ని కానుకలుకూడా సిద్ధం చేశాను. వీటిని నీవే ఆయనకు చేర్చాలి. అక్కడికి దారి నీకు తెలిసినట్టు మరొకరికి తెలీదు. అదీగాక, నిన్ను మళ్లీ చూసి ఆయన చాలా సంతోషిస్తాడుకూడా. నువు ఇవాళే ప్రయాణం కావలసి ఉంటుంది. మన జవాబుకోసం ఆ రాజును వేచిఉంచటం భావ్యం కాదు," అన్నాడు.

## ఏడవ సముద్రయానం



నాకు కళ్లు మసకలైనట్టయింది. కంగారులో పడిపోయాను. కాని ఖలీఫాకు కోపం వచ్చిపోతుందని నా భావాలను అణిచిపెట్టుకుని, ప్రయాణానికి సిద్ధంగా ఉన్నానని చెప్పాను. ఆయన నాకు దారిబత్తెంకింద పదివేల దీనారాలిచ్చాడు. తాను స్వయంగా ఇథియోపియా రాజుకు రాసిన జాబూ, ఆయనకు అందజేయవలసిన బహుమానాలూ నా పరం చేశాడు. వీటిలో ఒక ఎర్ర మఖ్మల్ పరుపూ, మరి రెండు వేరే రంగుల మెత్తలూ, నూరు తానుల సిల్కూ, తెల్ల కురువింద రత్నాలతో మలిచిన ఒక కూజా, మేలైన అరబ్బీగుర్రాలూ వున్నాయి.

ఏమాత్రమూ ఇష్టం లేకుండానే నేను బగ్దాదునుంచి బయలుదేరి బస్రా వెళ్లి అక్కడ ఒక నౌక పట్టుకున్నాను. రెండు మాసాలపాటు సముద్రయానంచేసి ఇథియోపియా రాజుండే దీవి చేరాను. ఖలీఫా ఇచ్చిన జాబూ, బహుమతులూ ఆయనకు అందజేశాను. ఆ రాజు ఖలీఫా ఔదార్యాన్ని ఎంతగానో మెచ్చుకుని, నన్ను చాలాకాలం అక్కడే ఉండిపొమ్మని నిర్బంధించాడు. నేను కొద్దిరోజులుమాత్రమే ఉండి, తరవాత ఆయనవద్ద సెలవు పుచ్చుకుని, ఆయన మళ్లీ ఇచ్చిన బహుమానాలతో మళ్లీ నౌకలో ఎక్కి బస్రాకు బయలుదేరాను.

గాలి అనుకూలంగా ఉండటంచేత తిరుగుప్రయాణం సుఖంగా సాగింది. దారిలో సీన్‌దీవిలో వర్తకులు క్రయ విక్రయాలు చేశారు. ఆ దీవిని వదిలిన వారం రోజుల అనంతరం ఒకనాడు పెద్దవాన సాగింది. మా సరకుల బేళ్లు తడిసిపోతాయని వాటిపై కాన్వాసు కప్పి ప్రయాణీకులం అందరం అల్లాను స్మరించాం.

ఈలోపల సరంగు తెరచాప స్తంభం ఎక్కి చాలాసేపు అన్నివేపులా పరీక్షించి చూశాడు. ఆయన కిందికి దిగి వచ్చేసరికి ఆయన ముఖం పాలిపోయి ఉంది.



అయన మాకేసి నిర్జీవంగా చూసి, నిశ్శబ్దంగా గడ్డం పీక్కోసాగాడు. మేమంతా అయన దగ్గిరికి పరిగెత్తి, "ఏమిటేమిటి?" అని అడిగాం.

"అల్లాను ప్రార్థించండి. మనని ఉద్ధరిస్తే అయనే ఉద్ధరించాలి. లేదా ఒక్క శోకంపెట్టి అప్పగింతలు చెప్పుకోండి. ఎందుకంటే, మనం దోవ తప్పి, ఇంతవరకు ఎవరూరాని, మారుమూల సముద్రంలో వచ్చిపడ్డాం," అన్నాడు సరంగు.

తరవాత అయన తన సంచిలోనుంచి డబ్బీతీసి పొడుము పీల్చి, ఒక పుస్తకం తీసి అందులో చూసి, "అహా! నేను అనుకున్నంతా అయింది. ఆ కనిపించే తీరం చాలా ప్రమాదకరమైనది. ఆ తీరాన భయంకరమైన జంతువులూ, ఘోరసర్పాలూ ఉంటాయి. సముద్రంలో నౌకలను మింగజాలినంత పెద్ద తిమింగలాలుంటాయి. మీ అందరికీ ఉన్న విషయం చెప్పేశాను. ఇక సెలవు!" అన్నాడు.

అయన ముగించాడో లేదో మా నౌక ఇంత ఎత్తు ఎగిరి మళ్లీ నీటిమీద పడింది. మా గుండెలు ఆగిపోయినట్టయింది. సముద్రమంతా తెర్లుతున్నట్టు కనిపించింది. దీనికి కారణం మూడు తిమింగలాలు! అవి



కొండల్లాగా ఉన్నాయి. మా నౌకను తరుముతూ వస్తున్నాయి. వాటిలోకల్లా పెద్దది తన నోటిని కొండలోయలాగా తెరిచి మా నౌకను అందుకున్నది. నౌక దాని నోటపడేలోపుగా నేను సముద్రంలోకి గెంతేశాను. నేను నీటిలోపడిన మరుక్షణం ఆ తిమింగలం నౌకను మింగేసింది. ఆ తరవాత మూడు తిమింగలాలూ నీటిలో మునిగి తమదారిన తాము వెళ్లిపోయాయి.

ఆ తిమింగలం నౌకను కొరికినప్పుడు బయటపడిన ఒక చెక్కమీదికి ఎగబాకి, సముద్రంలో చాలాసేపు అటూ ఇటూ కొట్టుకుని చివరకు ఒకలంకమీదికి వచ్చిపడ్డాను.

ఆ లంకలో ఫలవృక్షాలున్నాయి. వేగంగా ప్రవహించే ఒక నదికూడా కనిపించింది. ప్రయాణానికి ఈ నదిని ఉపయోగించు కుందామనుకున్నాను. ఎందుచేతనంటే రత్నాలదీవినుంచి నన్ను రక్షించినది నదే. ఈ నది నన్ను రక్షిస్తే సరేసరి, లేకపోతే ఇంతటితో నా కష్టాలన్నీ ఈడేరుతాయి, ఇదే ఆఖరు ప్రయాణమవుతుంది. ఇలా అనుకుని కొన్ని పళ్లు కోసుకు తిని ఒక చెట్టు కొమ్మలు పోగుచేసి తెప్ప తయారు చేసుకున్నాను. అది అసలైన అగరుచందనం చెట్టు అని నా కప్పట్లో తెలియదు. కొమ్మలను కలిపి కట్టటానికి తాళ్లయినా లేవు. బలమైన లతలు తెంపుకొచ్చి వాటితో తెప్ప తయారు చేశాను. దానిమీద పళ్లు పోగుచేసుకున్నాను. నేను తెప్పమీద ఎక్కి-ఒడ్డునుంచి తోశానో లేదో అది బాణంలాగా ప్రవాహాన పడి పరిగెత్తసాగింది. ఆ వేగానికి నేను తల తిరిగి పళ్లకుప్పమీద పడిపోయాను.

కొంతదూరం వెళ్లేసరికి నాకు ఎడతెగని పెద్ద హోరు వినిపించసాగింది. నది నురుగులు గక్కుతూ ప్రవహిస్తున్నది. దానివేగం చెప్పతరంకాదు. ముందుకు చూస్తే కొంత దూరాన నది అకస్మాత్తుగా అయిపోయినట్టు కనబడింది. అక్కడ ఒక పెద్ద జలపాతం ఉన్నట్టూ, నాకు వినపడే హోరు దానిదే



అయినట్టూ, నా తెప్ప శరవేగంతో ఆ జలపాతాన్ని సమీపిస్తున్నట్టూ వెంటనే నేను గ్రహించ గలిగాను.

నాకు ఆయువు మూడింది. జలపాతం వెంట పడేటప్పుడు నా శరీరం చితికి పోవటం కళ్లారా చూడటానికి మనసొప్పక, తెప్పను గట్టిగా వాటేసుకుని, కళ్లు మూసుకుని పడుకున్నాను. అఖరు క్షణంలో నా మనసు భగవంతుడిమీద లగ్నమై ఉంది.

నా తెప్ప జలపాతం అంచుకు వచ్చి ఒరిగిందికూడానూ. ఆ సమయంలో అకస్మికంగా అది కదలటం మానేసి అలాగే ఉండి పోయింది. నేను విస్మయంతో కళ్లు తెరిచిచూద్దును కదా, ఒక పెద్ద వలలో నేనూ, నా తెప్పా చిక్కి ఉన్నాం. దాన్ని మా మీదికి విసిరినవాళ్లు ఒడ్డున ఉన్నారు. వాళ్లు వలను లాక్కుని నన్నూ, నా తెప్పనూ ఒడ్డుకు చేర్చారు.

నేను కొనప్రాణంతో, చలికి వణుకుతూ ఒడ్డున పడుకుని ఉన్నాను. తెల్లటి గడ్డం గల ఒక వృద్ధుడు నన్ను దయగా పలకరించి, నా మీద వెచ్చని బట్టలు కప్పాడు. ఆయన నా శరీరమంతా మర్దన చేశాడు. ఆయన చేసిన ఉపచర్యలతో నాకు మళ్లీ కాస్త బలం వచ్చింది. నేను లేచి కూర్చున్నాను. కాని నా నోట మాట రాకుండా





ఉంది. ముసలాడు నన్ను పట్టుకుని స్నాన శాలకు నడిపించుకుపోయి, అక్కడ చక్కగా స్నానం చేయించాడు, నా వంటికి సుగంధ తైలాలు మర్దన చేయించాడు, తరవాత నన్ను తన ఇంటికి తీసుకు పోయాడు. ఇంటివాళ్ళంతా నన్ను ఎంతో స్నేహభావంతో చూశారు. కూర్చోవటానికి మంచి ఆసనం ఇచ్చి, తృప్తిగా భోజనం పెట్టారు. తరవాత ఆ గృహస్థు నాకొక గది చూపి, నాకేమైనా కావలిస్తే చూడటానికి కొందరు బానిసలను ఉంచి, తన పనిమీద తాను వెళ్ళాడు. ఈ విధంగా మూడురోజులు గడిచాయి. నన్ను ముసలివాడు గాని ఇతరులుగాని ఒక్క ప్రశ్నకూడా అడగలేదు. ఈ మూడు రోజులలోనూ నేను మళ్ళీ ఎప్పటి మనిషి నయాను.



నాలుగోరోజున వృద్ధుడు నాదగ్గిరికివచ్చి, "మీకు ఏ లోపమూ కలగటం లేదుగద. అల్లా అనుగ్రహంవల్ల నే నా సమయానికి అక్కడ ఉండి మిమ్మల్ని ఆపదనుంచి కాపాడగలిగాను... ఇంతకూ మీ రెవరు? ఎక్కడినుండి వస్తున్నారు?" అన్నాడు.

నేనాయనకు కృతజ్ఞతాభివందనాలు తెలుపుకుని నా కథ యావత్తూ చెప్పాను. నేను వర్తకుణ్ణనీ, చాలాసార్లు సముద్ర యానాలు చేశాననీ చెప్పాను. ఆయన ఒక గంటసేపు నే చెప్పినదంతా విని, "అయితే నా మాట విని, మీ సరుకు వెంటనే అమ్మెయ్యండి. ఎందుకంటే అది చాలా మేలు రకమైనది. ఇక్కడ దానికి మంచి గిరాకీ కూడా ఉంటుంది!" అన్నాడు.

ఈ మాటలు విని నేను నిర్ఘాంత పోయాను. ఆయన ఏ విషయం మాట్లాడుతున్నదీ నాకు తెలియలేదు. ఎందుకంటే నేను కట్టుబట్టలతో వచ్చిపడ్డాను. నా వెంట సరుకేమీ లేదు. అయినా నే నా మాట వెంటనే పైకి అనెయ్యక, "అలాగే చూదాం లెండి!" అన్నాను.

"మళ్ళీ అలస్య మెందుకు? మనం ఇప్పుడే బజారుకు వెళ్లి సరుకు అమ్మేద్దాం. మంచి ధరవస్తే సరేసరి, లేకపోతే సరుకును నా గిడ్డంగినుంచి కదిలించనే వద్దు," అన్నాడాయన.

"మీ యిష్టం, బాబుగారూ. నేను మీ చేతిలోవాణ్ణి. మీ రెలాచేస్తే బాగుంటుందని తోస్తే అలాగే చేసెయ్యండి. నాతో చెప్ప వలిసిన అవసరంకూడా లేదు," అన్నాను, లోపల ఆశ్చర్యపడుతూనే.

తరవాత ఇద్దరమూ కలిసి బజారుకు వెళ్లాం. మేమక్కడికి వెళ్లాక, నా ఆశ్చర్యం చూసి తీరాలి. అక్కడ నా తెప్ప ఉన్నది. దాన్ని దళార్లూ, వర్తకులూ పరీక్షిస్తున్నారు. "యా అల్లా! అద్భుతమైన చందనం! నే నెన్నడూ ఇంత మంచిది చూసి ఉండ లేదు!" అనే మాటలు వినపడుతున్నాయి. నా సరుకు ఏమిటో నాకు తెలిసి వచ్చింది. నేను పైకి గుంభనగా ఉండిపోయాను.

వృద్ధుడి అనుమతితో వేలంపాట ప్రారంభమయింది. మొదటి పిలుపు వెయ్యి దీనారాలు. వృద్ధుడు రెండు వేలన్నాడు. ఇంకెవరో మూడు వేలన్నారు. పాట పది వేలదాకా పెరిగాక వేలం వేసేవాడు నాకేసి తిరిగి, "పదివేలకు కొట్టెయ్యమంటారా?" అని అడిగాడు. నేను వల్లకాదన్నాను.

అప్పుడు వృద్ధుడు నాకేసి తిరిగి, "బాబూ, ఇంతకంటె ధర పెగలదు. అసలే వ్యాపారం ఇప్పుడు అంతంతమాత్రంగా ఉంది. కావా లంటే మరొక వందచేసి నేనే సరుకు తీసు కుంటాను," అన్నాడు.

"బాబుగారూ, మీరే తీసుకునేట్టుంటే తప్పక తీసుకోండి. నేకాదంటానా?" అన్నాను. వృద్ధుడు నా తెప్పను తన బాని సలచేత గిడ్డంగికి పంపేశాడు. మే మిద్ద రమూ ఇంటికి వచ్చేశాం. అయన నాకు పదివేల ఒక వంద దీనారాలూ ఒక ఇనప పెట్టెలో పెట్టి ఇచ్చాడు. (ఇంకా వుంది)





# మిత్రభేదం

అక్కడ దమనకుం - డరిగిన యంత
చిక్కన వడి గిత్త - చింతింప సాగె :
"పచ్చిక దిను నేను - వచ్చి, మాంసమ్ము
పచ్చిదే తినువారి - పంచ జేరితిని
ఎటు కేగువాడ నా - కెప రింక దిక్కు
ఇటు సింహమునె ఆశ్ర-యించి చూచెదను"
అనుకొని మెల్లగా - అధిపతి జేరె.
అనిన్లై దొర కోప-మున| జూచుచుండె
పింగలకమ్మును - బెడిసిన దంచు
కంగారుపడి ఒక్క - గంతులో దూకె
అయినది కానిమ్మ-టంచును గిత్త
భయరహితమ్మయి - పడగొట్ట జూచె
అవి రెండు పోట్లాట - కటు దిగినంత
దవు దవ్వులను నక్క - లవి మాటలాడె.

కరటకుడు :

ఏమి చేసితివోయి - యిటు వీరు చావ
ఏమి వచ్చును లాభ - మేమున్న దిందు ?
మంచిగా నగు పని - మాని పోట్లాట
పెంచుట తగదన్న - మంచివారలకు
ఇరువురు మడిసిన - నింకేమి కలదు
సరి జేయు టే గొప్ప - సచివోత్తములకు
దొర తప్పు నిజ విని - త్వరపడినాడు
ఇరవుగాదిట నుండ - నిక పెద్దలకును
చెడువాని వినిపింప - చెట్టయే గల్గు
విడమర్చి చెప్పెద - విను మొక్క కథను.

అనర్హోపదేశం - కథ

ఒక కాన జమ్మిచె - ట్టొక్కటి కలదు
ఒక పిట్టజంట అం-దుండె కాపురము
చలికాల మది వాన - జలజల కురిసె
వలి కాగలేదయ్యొ - వానర మొండు
వడవడ వడకుచు - వచ్చి అ చెట్టు
తడిక్రింద కూర్చున్న - తడయక చూచి
అ పిట్ట లనె : "మను-ష్యాకారముండి
ఈ పాటు పడనేల-నే పిచ్చి కోతి ?
గూడు కట్టుకొనంగ - కూడదా యిట్లు
అడీడ తిరిగిన - అణగునే సీతు"

విద్వాన్ విశ్వం



కోతికి ఆ మాట - కోపము దెచ్చె
"నీతి సెప్పెదరేల - నే నెఱుంగుదును
నోరు మూసుకొనుండు - నొక్క వేసెదను.
నోరు చేసుకొనంగ - మీరెవ్వ రిచట"
అను కోతి మాటల-కా అడుపక్షి
కినిసె: "మూర్ఖమ్మేల-కీలుండి కూడ
ఇల్లు కట్టుకొనంగ - నెటులైన మేలు
చల్లగాలికి నిట్లు - చావంగ నేల?"
అనుచుండు నంతలో - నా కోతి లేచి
కినుకతో నా గూడు - కెరలంగ దన్నె.
కావున నే నంట - కాదు నీచులకు
నేవిధి నీతుల - నేర్పుట; తప్పు.
తెలివైనవారికి - తెలియు బోధింప



తెలివిమాలినవారు - తెలియ రేనాడు.
తను చచ్చినను సరే - తవిలి యింకొకరు
మునుకొని కీడున - మునిగిన చాలు
అల్పబుద్ధులు తృప్తి-నందుదు రెపుడు
స్వల్పుని కథ నీవు - సరి వినలేదె?

దమనకుడు:

వినిపింపు మా కథ - విశదంబుగాను
వినలేదు నే నెప్డు - వినయ సంపన్న!

ధర్మబుద్ధి కథ

కల రొక ఊర మి-త్రులు ధర్మబుద్ధి
అల పాపబుద్ధి నా - అలరెడువారు.
ధర్మబుద్ధిని తోడు - తరలంగ దీసి
మర్మమ్ముగా ధన - మార్జింప నెంచి
పాపబుద్ధి యొకింత - పట్టు నెఱింగి
ఈ పద్ధతిని చెప్పె - నెంతొ స్నేహమున
దేశాలు తిరుగక - తెలివి రాదన్న
దేశాటన మ్మన్న-దే గొప్ప విద్య
అది నిజమేనని - ఆ ధర్మబుద్ధి
పదమన్న యిరువురు - పయనమైనారు
దూరదేశమ్ముల - నూరూర తిరిగి
ధారాళముగ చేతు-లార నార్జించి
తిరిగి వచ్చుచునుండ - తరిచూచి చెప్పె
మఱి పాపబుద్ధి ఆ - మాన్యుతో నిట్లు:
"ఇంత ధనమ్మిట్టు - లిల్లు జేర్చితిమ



ఎంతొ ఉన్నదటంచు - నెల్లరు తలచి
మాకిమ్ము మాకని - పీకి పెట్టెదరు
ఈ కాన నొకచోట - నెట్టులో దాచి
కొంత ధనమ్ముతో - కూడి యేగుదము
చింత లేకుండగా - జీవింపవచ్చు"
ఔననిపించి ఆ - హతకుడు ధనము
కానలో నొక గుంత - కావించి పూడ్చె
ఇరువు రంతట యింటి - కేగి కొన్నాళ్ళు
పరులకు చెప్పక - వర్తిల్లినారు.
పాపబుద్ధికి నిద్ర - పట్టుట లేదు.
ఏ పాప మెఱుగ డా - హిత ధర్మబుద్ధి
ఒక రాత్రి చీకటి - యోలగమ్ముండ
ఒక పిట్ట పలుకని - యొక సమయాన
పాపబుద్ధి రహస్య-గోపనమ్ముగను
మాపున అడవికి - మఱుగున వెళ్లి
గుంతను తీసి ఒకి-ంత పోకుండ
అంత ధనమ్మెల్ల - అపహరియించి
గుంతను మట్టితో - గొబ్బున మూసి
చింతింపకే యిల్లు - చేర్చి కూర్చుండె.
ఉన్న దైపోయి యీ-లో ధర్మబుద్ధి
తిన్నగ పాపబు-ద్ధిని చీరి పలికె
"చేతిలోనున్నది - చెల్లిపోయినది.
ఓ తమ్ముడా వెళ్ళి - యొక్కింత ధనము
త్రవ్వి తీసుకవత్త - మవ్వని కేగి



ఇవ్వేళ"నన్న స-రే అనె వాడు.
ఇరువురు నేగి అ-య్యెడ త్రవ్విచూడ
సరసర మట్టియే - దరిసెనమిచ్చె
"కొంపకూల్చితివిరా - క్రూరుడా అంచు
దుంపత్రెంచితివిరా - ద్రోహి నీ వంచు"
ఆ పాపబుద్ధియే - అఱవగా సాగె
ఈ పాప కృత్యమ్ము - నీవె చేసితివి
అంచు నా సగమిమ్ము-టంచు దూషించి
వంచకుడాతడు - వాదించసాగె.
ఎఱుగనే నిదియన్న - నేమాత్ర వినక
చరచర అధికార - సంస్థకుపోయి
తనకు వానికి తప్ప - ధనమున్నదంచు
మనిషికి తెలియదు - మఱిపోయె నంచు




# ఆదర్శ దంపతులు

పూర్వం ప్రయాగలో ఒక వర్తకడుండేవాడు. ఆయన సంపన్నుడే గాక సజ్జనుడు కూడా. ఆయన భార్య అన్నివిథాలా భర్త వంటిదే. ఆ భార్యా భర్తలు ఆదర్శదంపతులలాగా ఉండేవారు. వారి జీవితాలకు ఒకటే కళంకం; అదేమిటంటే, వారి కుమారుడు శశికేతుడనే వాడు.

శశికేతుడు పరమ పాపిష్టి. వాడు పసితనంనుంచీ చెడు సావాసాలు చేసి దుర్మార్గంలో పడిపోయాడు. తండ్రి ఎంత మందలించినా, తల్లి ఎంత బతిమాలినా వాడి పద్ధతి కొంచెంకూడా మారలేదు. వాడిమూలాన వాడి తలిదండ్రులు నలుగురిలోనూ తల ఎత్తుకు తిరగటానికికూడా వీలులేకుండా పోయింది.

వర్తకుడికి ఊరి పూజారి ఆప్తమిత్రుడు. అందుచేత వర్తకుడు తన కొడుకు విషయం పూజారితో చెప్పుకున్నాడు.

"మా శశి దుర్మార్గం అనాటికానాడు హెచ్చిపోతున్నదిగాని కొంచెంకూడా తగ్గేటట్టు లేదు. ఏళ్లు పైన పడితే వాడే సరి అయిన మార్గంలోకి వస్తాడని ఆశపడ్డాను గాని, ఆ ఆశ కాస్తా పోయింది. ఏంచేస్తే వాడు బాగుపడతాడో మీరైనా చెప్పండి. నా భార్య సగం వాడిమూలానే మనోవ్యాధితో తీసుకుంటున్నది. వాడు బాగుపడకపోతే అది జీవించదు!" అన్నాడు వర్తకుడు.

"నిజం చెప్పాలంటే, మీ ఇద్దరి మంచితనమే వాణ్ణి ఇంతకు తెచ్చింది. మీ అండ చూసుకునేవాడు అచ్చుపోసిన ఆబోతులాగా తిరుగుతున్నాడు. నా మాట విని వాణ్ణి దూరదేశం పంపెయ్యండి. అక్కడ వాడికి పరపతి ఉండదు, దుర్వ్యయం చెయ్యటానికి డబ్బుండదు. తప్పనిసరిగా వాడు తన బతుకుతెరువు తానే చూసుకోవలిసి వస్తుంది. బాధ్యత పైన పడుతుంది. ఆ తర

వి. రామమోహనరావు

వాత వాడే మారిపోతాడు, ప్రయోజకుడౌతాడుకూడా!" అన్నాడు పూజారి.

ఈ సలహా వర్తకుడికి సరిగానే తోచింది. ఆయన తన కుమారుణ్ణి పిలిచి, "నాయనా నువు దూరదేశం వెళ్లి ప్రయోజకుడవై కీర్తి తెస్తే నేను చాలా సంతోషిస్తాను. నీకు ఏ దేశం వెళ్ళాలని ఉన్నది?" అని అడిగాడు.

"నన్ను కాశీకి పంపించండి!" అన్నాడు శశికేతుడు. ఆ పుణ్యక్షేత్రంలో మహా పాపులు విచ్చలవిడిగా సంచరిస్తూ ఉంటారని వాడు తన స్నేహితులు చెప్పగా విని వున్నాడు. కాశీనగరంలో పూజారికి దూరపు బంధు వొకాయన ఉన్నాడు. ఆయన పేర ఒక ఉత్తరం రాసి పూజారి వర్తకుడి కొడుకు కిచ్చాడు. దాన్ని తీసుకుని శశికేతుడు కాశీకి బయలుదేరాడు.

పూజారి చేసిన ఆలోచన ఫలించినట్టే కనబడింది. ఎందుకంటే, కాశీలో ఉండే ఆయన బంధువు శశినిగురించి అప్పుడప్పుడూ మంచిగానే ఉత్తరాలు రాస్తూ వచ్చాడు. ఈ ఉత్తరాలను పూజారి పట్టుకుపోయి వర్తకుడికి చదివి వినిపించేవాడు. వర్తకుడూ, ఆయన భార్యాకూడా తమ కొడుకు ప్రయోజకుడవుతున్నాడని ఎంతో ముచ్చట పడ్డారు.






ఇంతలో పిడుగుపడ్డట్టయింది. కాశీ నుంచి శశికేతుణ్ణిగురించి పూజారికి ఒక ఉత్తరం వచ్చింది. శశికేతుడికీ మరి కొందరు తాగుబోతు జూదరులకూ ఏదో తగాదా వచ్చింది. దాని ఫలితంగా మిగిలిన వాళ్లు శశికేతుణ్ణి పొడిచి చంపారు.

దూరదేశం వెళ్లినా శశికేతుడు మారలేదన్నది పూజారికి స్పష్టమయింది. ఈ దుర్వార్తను తన స్నేహితుడైన వర్తకుడి చెవిని వెయ్యటం ఎట్లాగో పూజారికి అర్థం కాలేదు. కానీ నిజం దాచి లాభంలేదు. వర్తకుడి భార్య అసలే రోగిష్ఠి మనిషి. ఒంటరిగా పిలిచి వర్తకుడితోనే ఈ మాట



చెప్పటానికి నిర్ణయించాడు పూజారి. తన కొడుకు దుర్మరణం గురించి విని వర్తకుడు దిమ్మరపోయాడు. కాని ఆయన కన్నీరు కార్చి ఏడవలేదు. "ఇటువంటిదేదో జరుగుతుందని నేను చాలా కాలంగా అనుకుంటూనే ఉన్నాను. భయపడ్డంతా జరిగింది. దూరదేశం పంపితే వాడు మారతాడనుకున్నాం, కాని వాడు మారలేదు. మారే రకంకూడా కాదు!" అన్నాడాయన విచారంగా.

తరవాత ఆయన పూజారికేసి తిరిగి, "బాబూ! మీరీ సంగతి నా భార్యకుమటుకు తెలియనివ్వకండి. అసలే దాని ఆరోగ్యం ఏమీ బాగాలేదు. ఈ మాట వింటే గుండె పగిలి చచ్చిపోతుంది. అది ఇంక ఎంతో కాలం బతకదు. తన కొడుకు దూరదేశంలో ఉన్నా సుఖంగా ఉన్నాడనుకుంటూ చావనివ్వండి. మీరు ఎప్పటిలాగే మీ బంధువు రాసినట్టుగా ఉత్తరాలు తెచ్చి దానికీ నాకూ వినిపిస్తూ ఉండండి!" అన్నాడు.

"అలాగే చేస్తాను! మీరేమీ విచారించకండి. ఆ ఇల్లాలికి బాధ ఏమాత్రమూ కలగకుండా నేను చూస్తాను!" అన్నాడు పూజారి. ఆయన నెల కొకసారి ఒక ఉత్తరం సృష్టించి వర్తకుడి ఇంటికి వెళ్ళేవాడు.





"ఏమండోయ్, కాశీనుంచి ఇంకో ఉత్తరం వచ్చింది. మీవాడు సుఖంగా ఉన్నానని మీతో మరీ మరీ చెప్పమన్నాడట. అన్నట్టు మీవాడికి త్వరలోనే రాజుగారిదగ్గిర కొలువవుతుందని మా బంధువు గట్టిగా అంటున్నాడు!" అనేవాడు.

ఇంకోసారి, "వచ్చే వైశాఖ పాడ్యమి నుంచీ మీవాడు కొలువులో ప్రవేశిస్తున్నాడట!" అనేవాడు.

మరొకసారి, "మీవాడికి రాజుగారు గొప్ప బహుమతీ ఇచ్చారట. వాడి పెళ్లి విషయం తానే చూస్తాననికూడా అంటున్నాడట!" అనేవాడు.

వేరొకసారి, "మీవాడికి మీ ఇద్దరినీ చూడాలని ఎంతగానో ఉందట! శలవు దొరకటమే వ్యవధిగా తిరిగి వచ్చేస్తానంటున్నాడు!" అనేవాడు.

పూజారి వచ్చినప్పుడల్లా వర్తకుడూ, అయన భార్యా ఎంతో ఆనందంతో స్వాగతం చెప్పేవారు. అయన చెప్పే విషయాలను అతిశ్రద్ధగా వినేవారు. వర్తకుడి భార్య బాధతో మంచంపట్టి ఉన్నాకూడా, పూజారిని చూడగానే తన మొహంలో బాధ ఏ మాత్రమూ తెలియనివ్వక ఎంతో ఆనందం కనబరిచేది.



"ఇంత మంచి ఇల్లాలిని మోసం చేస్తున్నాను గదా!" అని పూజారి లోలోపల చాలా నొచ్చుకునేవాడు. కాని తాను తెచ్చిన అబద్ధపువార్తలు విని అవిడ పొందే ఆనందం చూడగానే అయనకు, "నేను చేసేది మంచి పనే! ఆ యిల్లాలు ఆనందంపొందటంకన్న కావలిసిందేమిటి?" అనిపించేది.

ఈ విధంగా నాలుగేళ్లు గడిచాయి. వర్తకుడి భార్య జబ్బు క్రమంగా ముదురుతూ వచ్చింది. అవిడ క్షయతో పూర్తిగా మంచం పట్టిపోయింది.

అమె ఇక ఎంతోకాలం బతకదని వైద్యులు చెప్పేశారు. ఒకనాడు పూజారికి



వార్త వచ్చింది. పర్తకుడి భార్య ఇప్పుడో, ఇంకాస్సేపటికో అన్నట్టున్నదని చెప్పారు. పూజారి వెంటనే బయలుదేరి వెళ్లాడు. వర్తకుడు ఇంటో లేడు.

"నేను పోతున్నాను, బాబూ! ఆ ముసలాయన భారం నీదే!" అన్నది వర్తకుడి భార్య పూజారిని చూడగానే.

"అదేమిటమ్మా? అలా అధైర్య పడతారూ? మీవాడు బయలుదేరి వస్తున్నాడట! ఇప్పుడే నాకు వార్తవచ్చింది. ఈపూట కాశీనుంచి కొందరు యాత్రికులు వచ్చారు. వారిద్వారా మా బంధువు కబురుచేశాడు. మీరుత్వరలోనే మీ శశిని కలుసుకుంటారు!" అన్నాడు పూజారి.

రోగి విచారంగా నవ్వి, "ఆ మాట నిజమే, నాయనా! ఆ లోకంలో ఇద్దరమూ కలుసుకుంటాం!...ఆశ్చర్యపడకు, బాబూ! నాకు చాలాకాలంగా తెలుసు, మా శశి చనిపోయాడు. కాని కాశీలోఉన్న మీ బంధువు ఎంత ఉత్తముడు! ఆయన ఋణం తీర్చుకోలేం! శశి పోయిన సంగతి తెలిస్తే ముసలాయన ఏనాడో కుంగిపోయి ఉండును! ఇన్నాళ్లూ ఈ సంగతి ఆయనకు తెలియకుండా నేను చూసుకున్నాను! ఇక మీదట ఆయనకు తెలియకుండా చూస్తానని నువు ప్రమాణంచెయ్యి, నాయనా! లేకపోతే నేను శాంతంగా చచ్చిపోలేను. మావాడు పోయినట్టు ఆయనకు బతికుండగా తెలియకూడదు! ఇదే నాకోరిక!" అంటూ వర్తకుడి భార్య కన్నుమూసింది.

పూజారికి విచారం కలగలేదు, పట్టరాని ఆనందం కలిగింది.

ఎంత ఆదర్శదంపతులు! ఒకరికి బాధ కలగకుండా ఉండాలని ఒకరు కార్చిచ్చులాంటి వార్తను తమ హృదయాలలో దాచుకున్నారు.

ఆ వర్తకుణ్ణీ, ఆయన భార్యనూ మెచ్చుకుంటూ పూజారి తన ఇంటిదారి పట్టాడు.






[ట్రోయ్‌నగరపు రాజైన వర్ధనుడి కుమారుడు మోహనుడు, ప్రతాపుడనే గ్రీకురాజు భార్యను భువనసుందరిని ఎత్తుకుపోవటమూ; భువనసుందరిని తిరిగి తెచ్చుకునే నిమిత్తం గ్రీకులు నౌకలలో బయలుదేరి, ట్రోయ్‌నగరాన్ని ముట్టడించి, పదేళ్ళ యుద్ధం అనంతరం కొయ్యగుర్రం సహాయంతో ట్రోయ్‌నగరంలో ప్రవేశించి, నగరాన్ని తగల బెట్టటమూ, "భువనసుందరి" అనే గ్రీకు పురాణగాథలో చదివాం.

ట్రోయ్‌పైకి దండెత్తివెళ్ళిన గ్రీకువీరులలో ఒకడైన రూపధరుడు, యుద్ధానికి బయలుదేరబోయే సమయంలోనే, మరి ఇరవై సంవత్సరాలదాకా ఇంటికి తిరిగిరాడని జోస్యం చెప్పారు. ఈ ఇరవై సంవత్సరాలలో పది సంవత్సరాలు ట్రోయ్ ముట్టడిలోనే గడిచాయి. మరి పది సంవత్సరాలపాటు రూపధరుడు అతి విచిత్రమైన అనుభవాలకు గురి అయాడు. ఈ అనుభవాలను చిత్రించే కథ ఈ సంచికనుండీ ప్రారంభమవుతున్నది.]

రూపధరుడి నౌకలు ట్రోయ్‌తీరాన్ని వదల గానే ఎదురుగాలి సాగింది. నౌకలు దక్షిణ దిక్కుగా ప్రయాణించటానికి మారుగా ఉత్త రంగా వెళ్లి ఇస్మరోస్ తీరాన్ని తాకాయి. ఇది కికోనియను లుండే నగరం.

రూపధరుడి బలాలు నగరంమీద పడి దోచి, నగరాన్ని ధ్వంసం చేసేశాయి. సైని కులు నగరంలోని స్త్రీలనూ, పశువులనూ, సంపదలనూ పంచుకున్నారు. "మనం ఎంత త్వరగా బయలుదేరి వెళ్ళిపోతే అంత మంచిది!" అని రూపధరుడు చెప్పాడు. కాని సైనికులు అతని మాటలు వినే స్థితిలో లేరు. ఎందుచేతనంటే వారికి నగరంలో అంతులేని సారాయి దొరికింది.

గ్రీకు పురాణగాథ



అందరూ తప్పతాగి, సముద్రతీరాన పశువులను చంపి, కాల్చి, విందుచేసే ప్రయత్నంలో ఉండిపోయారు.

ఈలోపుగా నగరంనుంచి తప్పించుకుని పారిపోయిన కికోనియనులు ఇతర గ్రామాలకు వెళ్లి అసంఖ్యాకులైన యోధులను వెంటబెట్టుకు వచ్చారు. ఇలా వచ్చిన వారిలో రథాలమీద నిలబడీ, అవసరమైతే కింద దిగీ యుద్ధం చెయ్యగలవారు అనేక మంది ఉన్నారు.

తెల్లవారుజామున ఈ కికోనియను యోధులు మిడతలదండులాగా వచ్చి రూపధరుడి సైనికులపై పడ్డారు. ఘోర



మైన యుద్ధం జరిగింది. కికోనియనుల సంఖ్య హెచ్చు. పొద్దెక్కుతున్నకొద్దీ రూపధరుడి బలాలు తగ్గసాగాయి. చచ్చిపోయిన గ్రీకుల సంఖ్య నౌకకు ఆరుగురు చొప్పున ఉన్నది. మిగిలినవారు తమ నౌకలలో దూకి ప్రాణాలు రక్షించుకున్నారు.

వారు సముద్రంమీద కొద్దిదూరం వెళ్ళే సరికల్లా వాయువ్యదిశనుంచి ఝంఝామారుతం సాగింది. భూమివైపునుంచీ, సముద్రంవైపునుంచీ కూడా నీలిమేఘాలు వచ్చి ఆకాశాన్ని ఆవరించాయి. రాత్రి ముంచుకు వచ్చింది. ఆ ఘోరుగాలికి తెరచాపలు ఉబ్బి పడవలు వాయువేగాన కొట్టుకు పోసాగాయి.

త్వరలోనే తెరచాపలు గాలి తాకిడికి తట్టుకోలేక చినిగి చీలికలైపోయాయి.

ఎవరి ప్రాణాలూ దక్కవని రూపధరుడికి భయం పట్టుకున్నది. అన్ని నౌకల తెరచాపలూ దించేసి, తెడ్లువేస్తూ తీరాన్ని చేర్చమని అతను తన సైనికులకు చెప్పాడు. నౌకలు తీరాన్ని చేరాక రెండు రోజులపాటు గ్రీకులు తమ ప్రాణాలను అరిచేతబట్టి తుఫాను నిలుపుదలకోసం ఎదురుచూశారు. ఆ రెండు రోజులూ వారు సూర్యకాంతి చూసి ఎరగరు.





చివరకు మూడోనాటి ఉదయం తూర్పున అరుణోదయం కనిపించేసరికి వారికి మళ్ళీ ప్రాణాలు తిరిగి వచ్చినట్టయింది. వారు మళ్ళీ తెరచాప స్తంభాలు ఎత్తి, కొత్త తెర చాపలు ఏర్పాటుచేశారు. వారి ప్రమేయం ఏమీ లేకుండానే నౌకలు గాలివాలున వేగంగా పోసాగాయి.

నాలుగురోజు లీవిధంగా ప్రయాణంచేసి రూపధరుడి నౌకలు మలియా అగ్రాన్ని చేరుకున్నాయి. ఈ అగ్రాన్ని చుట్టి ఉత్తరంగా వెళితే రూపధరుడు తన స్వదేశమైన ఇథాకాను చేరవచ్చు. గాలి ఉధృతం కొంచెం తగ్గినట్టు కనబడింది. నౌకలు అగ్రాన్ని చుట్టి ముందుకు సాగవలిసిందిగా రూపధరుడు ఆజ్ఞ ఇచ్చాడు. కాని అంతలోనే మళ్ళీ ఝంఝామారుతం సాగి, నౌకలను కతీరా వైపుకు తీసుకుపోయింది.

తొమ్మిది రాత్రులూ, తొమ్మిది పగళ్ళూ రూపధరుడి నౌకలను వాయుదేవుడు బంతి ఆడాడు. పదవ రోజున వారు ఒక తీరాన్ని తాకారు. కాని రూపధరుడు ఈ తీరాన ఎక్కువ కాలం తన నౌకలతో నిలిచే అవకాశం లేక పోయింది.

ఎందుచేతనంటే, ఈ తీరాన ఉండే ప్రజలు ఒక రకం పళ్లు తింటారు. అవి



తేనె రుచిగా ఉంటాయి, వాటిలో గింజలు గాని, టెంకలుగాని వుండవు. అవి తింటే మనుషులకు పాతవిషయా లేవీ జ్ఞాపకం వుండవు; నల్లమందు తిన్నవాళ్లలాగా తన్మయత్వంలో నిమగ్నులవుతారు.

కాని ఈ సంగతి రూపధరుడికి తెలియదు. అతనూ, అతని అనుచరులూ తీరాన వంటచేసుకు తిన్నారు. తరవాత రూపధరుడు తనవాళ్ళను ముగ్గురిని పిలిచి, "ఈ తీరాన ఎలాటి మనుషులుంటారో చూసి రండి!" అని పంపాడు.

ఈ ముగ్గురు గ్రీకులకూ అక్కడి ప్రజలు అపకారమేమీ చేయకపోగా తాము తినే



ఫలాలను వారికికూడా ఇచ్చారు. అవి తిన గానే రూపధరుడి మనుషులు తాము వచ్చిన పని పూర్తిగా మరిచిపోయి పరమానందంలో మునిగిపోయారు.

ఎంతసేపటికీ తన మనుషులు తిరిగి రాకపోయేసరికి వారిని వెతుక్కుంటూ రూపధరుడు, మరికొందరిని వెంటబెట్టుకుని వచ్చి జరిగిన సంగతి తెలుసుకున్నాడు. అక్కడి ప్రజలు అతనికికూడా పళ్ళు తిన మని ఇచ్చారుకాని, రూపధరుడు వాటిని శంకించి తినలేదు. వాటిని తినిన తన మనుషులను అతను బలాత్కారంగా నౌకల వద్దకు తీసుకురావలిసి వచ్చింది. అప్పటికీ వారు, "మేము నీతో రాము. ఇక్కడే ఉంటాము! మమ్మల్ని వదిలెయ్యి! ఇక్కడే మాకు బాగున్నది!" అన్నారు.

రూపధరుడు వారిని తాళ్ళతో కట్టి నౌకలలో పడవేయించి, తాను ఇక ఆ తీరాన ఒక్క క్షణం ఉన్నా ప్రమాదమేనని గ్రహించి నౌకలను ముందుకు నడిపించాడు. ఈ నౌకలు కొన్ని రోజులు సముద్రంమీద ప్రయాణించి, తలవనితలంపుగా ఒక రాత్రి తీరాన్ని చేరాయి.

తాము ఎటువంటి ప్రదేశం చేరినదీ గ్రీకులు ఎరగరు. ఎందుచేతనంటే, ఆకాశాన చంద్రుడున్నప్పటికీ మేఘాలు దట్టంగా



ఉన్నాయి. అదీగాక సముద్రంమీద పొగ మంచు దట్టంగా వుండటంమూలాన అంత దూరంలో ఏమున్నదీ తెలియరాలేదు. మిగిలిన విషయాలు తెల్లవారి చూచుకోవచ్చునని, గ్రీకులు తెరచాపలు దించి, తమ నౌకలలోనుంచి తీరానికి వచ్చి, ఇసకలో పడుకుని మైమరిచి నిద్రపోయారు.

వారు తెల్లవారుతూనే లేచి, దీవిలాగా కనపడే ఆ ప్రదేశమంతా తిరిగి, అక్కడి ప్రకృతిసౌందర్యం చూసి అనేకరకాలుగా ముచ్చటపడసాగారు.

ఆ దీవిలో అన్ని రకాల ఫలవృక్షాలూ సమృద్ధిగా ఉన్నాయి, అంతులేని ద్రాక్ష తీగలున్నాయి. నేల చాలా సారవంతమైనది, కాని ఎక్కడా వ్యవసాయం లేదు. అయితే జలసమృద్ధికి ఏమాత్రమూ లోటు లేదు. అందుచేత వ్యవసాయం అవసరం లేకుండానే ఆ భూమిమీద అన్ని రకాల ధాన్యాలూ పండించవచ్చు.

గ్రీకులు తమ నౌకలను వదిలి ఎంతో దూరం వెళ్ళకమునుపే వారికి అడవి మేకలు కనబడ్డాయి. వారు వెంటనే తమ నౌకలవద్దకు పరిగెత్తి విల్లులూ, అంబులూ, ఈటెలూ తెచ్చుకున్నారు. వాటితో కొన్ని మేకలను చంపి వండుకుని రోజల్లా తింటూనే వున్నారు. ఎందుకంటే రూప





ధరుడి వెంటవున్న పన్నెండు నౌకలలో ఒక్కొక్క నౌక వంతూ తొమ్మిదేసి మేకలు చొప్పున వచ్చాయి.

ఆ రోజు వారు నౌకలను విడిచి వెళ్లక పోయినా, దూరాన మనుషుల నివాసాలున్న లక్షణాలు వారికి కనిపించాయి. సాయం కాలంపూట వారికి అక్కడక్కడా వంట ఇళ్ల తాలూకు పొగ కనిపించింది; దూరాన మేకలూ, గొర్రెలూ అరుస్తూవున్న చప్పుడు స్పష్టంగా వినిపించింది.

రూపధరుడు తూర్పు తెల్లవారుతూనే తన మనుషులను పిలిచి, వారితో ఇలా చెప్పాడు: "నేను నా పడవను నడుపు కుని ఈ తీరంవెంబడి వెళ్లి ఈ దీవిలో ఉండే మనుషులు నాగరికులో, అడవిజాతివాళ్లో, వాళ్లకు ఒక సమాజం ఉందో లేదో చూసి వస్తాను. నేను తిరిగివచ్చేదాకా మిగిలిన పడవలూ, మిగిలిన మనుషులూ ఇక్కడే కదలకుండా ఉండండి!"

రూపధరుడి నౌక కొంతదూరం తీరం వెంబడే వెళ్లేసరికి ఒకచోట తీరానికి కొంత ఎడంలో ఒక ఎత్తయిన దిబ్బమీద ఒక గుహ కనిపించింది. దానిమీదుగా లతలు పెనవేసుకుని ఉన్నాయి. దానిచుట్టూ పెద్ద ప్రహరీగోడలాటిది ఉన్నది. ఇందులో పెద్ద పెద్ద కొండరాళ్లూ, బ్రహ్మాండమైన చెట్ల బోదెలూ ఉన్నాయి.

రూపధరుడు తన నౌకను గుహకు ఎదురుగా నిలిపి, తన నావికులలో పన్నెండు మందిని, ధైర్యసాహసాలుగలవారిని, ఏరు కుని, ఒక మేకతోలు తిత్తిలో సారా తీసు కుని గుహకేసి బయలుదేరాడు.

ఈ సారా అపురూపమైనది. రూపధరుడు ఇస్మరోస్‌పై దాడిచేసినప్పుడు అక్కడ ఉండే ఒక అర్చకుణ్ణీ, అతని భార్యా బిడ్డ లనూ చంపక వదిలివేశాడు. అందుకు ప్రతిఫలంగా ఆ అర్చకుడు రూపధరుడికి అనేక తిత్తులలో అద్భుతమైన సారాయినీ,



వెండి బంగారాలనూ బహూకరించాడు. ఆ అర్చకుడు ఈ సారాను ఇరవై రెట్లు నీటిలో కలిపి తాగేవాడట. అప్పటికీ దాని మాధుర్యమూ, సువాసనా చెప్పనలవి కాకుండా ఉండేదట.

రూపధరుడూ, అతని అనుచరులూ త్వర లోనే గుహను చేరుకున్నారు. కాని గుహలో ఎవరూ లేరు. అది చాలా పెద్ద గుహ. అందులో అనేక అలవలు కట్టి ఉన్నాయి. వాటి నిండా గొర్రెపిల్లలూ, మేకపిల్లలూ, వయసువారీగా ఉన్నాయి. ఒకపక్క పాల మీగడ అచ్చులు పేర్చి ఉన్నాయి. అనేక భగోణీల నిండా పాలు ఉన్నాయి.

"ఈ మీగడ అచ్చులు పట్టుకుని మన దారిన మనం పోదాం!" అన్నారు రూప ధరుడి అనుచరులు.

"మనని అడ్డేవారు లేరు; ఈ గొర్రె పిల్లల్నీ, మేకపిల్లల్నీ తోలుకు పోదాం!" అన్నారు మరికొందరు.

కాని రూపధరుడు సమ్మతించలేదు. అందరూ తినగలిగినంత జున్ను మీగడ తిన్నారు. తరవాత ఆ గుహలో ఉండే మనిషికోసం ఎదురుచూడసాగారు.

చివరకు ఆ మనిషి రానేవచ్చాడు. మొదట అతన్ని గ్రీకులు చూడలేదు, పెళ



పెళారావంతో ఏదో వచ్చి గుహలో పడింది. అది ఒక ఎండుమానుల కట్ట! తరవాత అసలు మనిషి వంగి గుహలోకి వచ్చాడు. పిల్లిని చూసిన ఎలుకల్లాగా గ్రీకులు చెల్లా చెదరుగా పారిపోయి దాక్కున్నారు.

ఆ వచ్చిన మనిషి తాటిచెట్టు ఎత్తు న్నాడు. అతని నుదుట ఒకే ఒక కన్ను నిప్పుకణికలా మెరుస్తున్నది.

ఈ మనిషి ఒక పెద్ద గొర్రెలమందను గుహలోకి తోలాడు. ఆ గొర్రెలు బాగా కొవ్వి ఉన్నాయి. తరవాత ఒక బ్రహ్మాండమైన బండరాయిని ఎత్తి గుహకు అడ్డంగా వేశాడు. ఇరవై జతల ఎద్దులు తోసినా కదలనంత



73

పెద్ద రాయి అది. ఆ తరవాత వాడు అడ గొర్రెలన్నిటికీ పాలు తీశాడు.

ఈ మనిషి ఫాలలోచను డనే జాతివాడు. ఈ జాతికి చెందినవాళ్లు అనేకమంది ఈ ప్రాంతంలో ఉన్నారు. వీరికి సామాజిక జీవితం లేదు. ఎవరి కష్టసుఖాలు వారివి. విసిరిపారేసినట్టు ఒక్కొక్కరూ ఒక్కొక్క గుహలో ఉంటారు. ఒకరిని గురించి ఒకరు పట్టించుకోరు.

ఈ ఫాలలోచనులు వ్యవసాయం చెయ్యరు. అక్కడి నేల చాలా సారవంత మైనది కావటంచేత వ్యవసాయం లేకుం డానే బార్లీ మొదలైన ఆహార ధాన్యాలు సమృద్ధిగా పండుతాయి.

ఈ రాక్షసులు ఏడాది కొకసారి ధాన్యం కోసుకువస్తారు. మిగతా సమయాలలో బీళ్ల మీదికి గొర్రెలనూ మేకలనూ తోలుకు పోయి రోజల్లా మేపుతారు. బలమైన పచ్చిక తిని ఆ జంతువులు బాగా కొవ్వుతాయి. వాటిని కాయటం తప్ప ఈ ఫాలలోచనుల కింకేమీ చేతకాదు.

ఈ రాక్షసులు అనేక తరాలుగా సముద్ర తీరాన ఉంటున్నప్పటికీ వారికి పడవలు నిర్మించటంగాని, సముద్రయానాలు చెయ్యటంగాని చాతకాదు. అందుచేత వారు నాగరికత కొంచెమైనా తెలియక కేవలం బర్బరజీవితం గడుపుతున్నారు.

గ్రీకులు ప్రవేశించిన గుహలో ఉండే ఫాలలోచనుడు తాను పితికిన పాలలో సగభాగం విరిచి జున్నుచేసి, బుట్టలో పెట్టుకున్నాడు. మిగిలిన పాలను తాగ టానికి కాబోలు భగోణీలలో పోశాడు. తర వాత వాడు పొయిలో నిప్పు రాజేశాడు. ఆ మంటలలో వాడి ఒంటికంటికి గ్రీకులు కనిపించారు.

ఆ రాక్షసుడు తన కంటిని అటూ ఇటూ తిప్పుతూ, "ఎవరు మీరు ?" అని గుహ దద్దరిల్లేలాగా అరిచాడు. [ఇంకా ఉంది]






# గుడ్డి న్యాయం

బాగ్దాదునగరంలో ముగ్గురు గుడ్డిబిచ్చగాళ్లు కలిసి జీవిస్తుండేవారు. వారు రోజల్లా నగరపు వీధులలో తిరిగి ముష్టిఎత్తి తిండికి ఖర్చుకాగా మిగిలిన సంపాదనను తాముండే ఇంట్లో ఒకచోట భద్రంగా దాచేవారు. ఈ విధంగా వారు పన్నెండువందల వెండి దిరాములు పోగుచేశారు.

ఒకనాడు వారిలో ఒకడు ఒకవీధి ప్రవేశించి ఒక ఇంటి తలవాకిలి తలుపుతట్టాడు.

లోపలినుంచి ఇంటియజమాని, "ఎవరు వారు?" అని అడిగాడు. కాని గుడ్డివాడు జవాబుచెప్పక, మళ్లీ తలుపుతట్టాడు. తాను బిచ్చగాడని చెబితే ఇంటివాళ్లు తలుపు తెరవకుండానే, "ఇప్పుడేం లేదు, పో!" అంటారు. ఈ సంగతి గుడ్డిబిచ్చగాడెరుగును.

ఇంటియజమాని, "ఎవరు వారు?" అని రెండోసారి కేకపెట్టినా జవాబు రాకపోయేసరికి, తలుపుతెరిచి గుడ్డివాణ్ణి చూసి, "ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"గుడ్డివాణ్ణి బాబయ్యా, కరుణించండి!" అన్నాడు బిచ్చగాడు.

వెంటనే ఇంటియజమాని బిచ్చగాడికి చెయ్యి అందిస్తూ, "నా చెయ్యి పట్టుకుని లోపలికి రా!" అన్నాడు. తన పంట పడిందిగదా అనుకుని బిచ్చగాడు ఇంటియజమాని వెంబడి మేడమీద మూడో అంతస్తుదాకా ఎక్కివెళ్లాడు.

"ఇక్కడ కూచుని, నీకేం కావాలో చెప్పు!" అన్నాడు ఇంటియజమాని.

"ఆకలి మండిపోతోంది. ఇంత తిండి పెట్టించినా సరే, ఏమైనా డబ్బులు దయచేయించినా సరే!" అన్నాడు బిచ్చగాడు.

"అదా సంగతి? ఇక్కడ ఏమీలేదు. మరో ఇల్లు చూసుకో!" అన్నాడు ఇంటియజమాని.

ఆర్. నాగేశ్వరరావు

"ఈ భాగ్యానికి ఇన్నిమెట్లు ఎక్కించాలా, బాబూ? ఈ సంగతి కిందనే చెబితే పోయేదిగా?" అన్నాడు బిచ్చగాడు.

"ఎవరు వారని అడిగితే జవాబు చెప్పక పోవటమేం?" అన్నాడు ఇంటియజమాని.

"ఇంతకూ ఏమిటి సెలవు?" అన్నాడు బిచ్చగాడు.

"నీ కివ్వటానికి నా దగ్గిర చిల్లిగవ్వ లేదు," అన్నాడు ఇంటియజమాని.

"అయితే నన్ను మళ్లీ కిందికి చేర్చండి!" అన్నాడు బిచ్చగాడు.

"నాకిదే పనా? నీదారి నువే చూసుకో!" అన్నాడు ఇంటివాడు.

బిచ్చగాడు నిట్టూర్చిలేచి, తడుపుకుంటూ మెట్లవద్దకు వెళ్లాడు. మెట్లు దిగేటప్పుడు సగందారిలో కాలుజారింది. బిచ్చగాడు మిుక్కుతూ మూలుగుతూ లేచి ఎలాగో వీధిలోకి చేరుకున్నాడు.

సరిగా ఆ సమయానికే మిగిలిన ఇద్దరు గుడ్డిబిచ్చగాళ్లూ ఆ వీధికి వచ్చారు. మూడో వాణ్ణి మూలుగునుబట్టి పోల్చుకుని దగ్గిరికి వచ్చి, "ఏం జరిగింది?" అని అడిగారు.

గాయాలుతగిలినవాడు తన మిత్రులతో జరిగినదంతా చెప్పి, "ఇవాళకు నేను తిరగ లేను. మీదగ్గిర ఒక దిరాముంటే ఇవ్వండి, దుకాణంలో భోంచేస్తాను!" అన్నాడు.



"మాకూ దుర్దినమే! ఏమీ దొరకలేదు. ఇంటికి పోదాం!" అని మిగిలిన ఇద్దరు గుడ్డివాళ్ళూ అన్నారు.

ఈ బిచ్చగాళ్ళ సంభాషణ యావత్తూ ఇంటి యజమాని విన్నాడు. వాడొక పచ్చి దొంగ. తన ఇంటికి వచ్చిన గుడ్డివాడి వెన కడితే వాడుకూడా వచ్చి, ముగ్గురు బిచ్చ గాళ్ళూ అనుకున్న మాటలన్నీ విని, వాళ్ళుండే యింటికి బయలుదేరాడు.

త్వరలోనే ముగ్గురు బిచ్చగాళ్ళూ తమ ఇల్లు చేరుకుని, తాళం తెరిచి లోపలికి వెళ్ళి వెంటనే తలుపు వేసుకున్నారు. కాని ఈ లోపునే దొంగకూడా లోపల చేరాడు.

గుడ్డివాళ్ళు పెట్టె తెరిచి తమ సొత్తంతా లెక్కపెట్టుకున్నారు. పన్నెండు వందల వెండి దిరాములున్నాయి. అందులో ఒకటి తీసి ఒక గుడ్డివాడు రొట్టెలూ కూరలూ కొనుక్కొచ్చాడు. ముగ్గురూ కూచుని తిండి తినసాగారు. వారి పక్కనే చేరి దొంగ కూడా తినసాగాడు.

"నలుగురు నములుతున్న చప్పుడు వినిపిస్తున్నది. నాలుగోవాడెవడు? దొంగ!" అన్నాడు ఒక గుడ్డివాడు. మరుక్షణం వాళ్లు "దొంగ! దొంగ!" అని కేకలుపెట్టసాగారు.

ఈ కేకలు విని నలుగురూ వచ్చేసరికి దొంగ, తానుకూడా గుడ్డివారిలో ఒకడైనట్టు



కళ్లుమూసుకు కూచుని, "అయ్యా, బాబూ! మమ్మల్ని కొత్వాలుగారి దగ్గిరికి తీసుకు పొండి. అయనకు ఒక రహస్యం విన్న వించాలి!" అన్నాడు.

వెంటనే, అక్కడ చేరిన జనం నలుగురు గుడ్డివాళ్లనూ కొత్వాలుపద్దకు పట్టుకు పోయారు.

"ఎవరు వీళ్లు? ఎందుకు వచ్చారిక్కడికి?" అని కొత్వాలు అడిగాడు.

"బాబూ, మేము ముగ్గురమూ గుడ్డి బిచ్చగాళ్లం. ఎవడో దొంగ మా ఇంట ప్రవేశించి మేము కష్టపడి సంపాదించిన సొత్తు కాజేయ యత్నిస్తున్నాడు," అన్నాడు గుడ్డివారిలో ఒకడు.

"ఆ దొంగ ఏడీ? నిజం చెప్పండి," అన్నాడు కొత్వాలు.

"కమ్చీదెబ్బ తగలందే నిజం చెబుతామా, బాబూ?" అన్నాడు కళ్లు మూసుకుని ఉన్న దొంగ.

"అయితే నిజం చెప్పినదాకా వీణ్ణి కొరడాతో కొట్టండి!" అన్నాడు కొత్వాలు.

రెండు దెబ్బలు పడ్డాయో లేదో, దొంగ కళ్లు తెరిచి, "క్షమించాలి బాబూ!" నిజం చెప్పేస్తాను, నన్ను వదిలెయ్యండి. మేము నలుగురమూ గుడ్డివాళ్లలే నటిస్తూ నగరంలో ముష్టెత్తి పన్నెండువందలు వెండి దిరాములు సంపాదించుకున్నాం. నిజం చెప్పాను గనక నా వంతు నాకిప్పించండి! నాలుగు తగిలించారంటే వాళ్లుకూడా నిజం ఒప్పుకుంటారు!" అన్నాడు.

కొత్వాలు వాడి మాటలు నమ్మి వాడికి మూడువందల దిరాములు ఇచ్చి పంపేశాడు. తరవాత అయన మిగిలిన ముగ్గురు గుడ్డివాళ్లను ఎంత కొట్టించినా వాళ్లు కళ్లు తెరవనేలేదు. చివరకు స్పృహతప్పి పడిపోయినాక కొత్వాలు వాళ్లను వదిలేసి, వాళ్లు ఎంతో కాలంగా కూడబెట్టిన సొమ్ము తాను తీసుకున్నాడు.



# వైశ్యుడి యుక్తి

ఒక వైశ్యుడూ, క్షత్రియుడూ తమ గుర్రాలమీద ప్రయాణంచేస్తూ దారిలో కలిశారు. వారు కొంతదూరం వెళ్లాక పొద్దూకింది. ఒకచోట రాత్రికి పడుకున్నారు. "ఇద్దరమూ నిద్రపోతే మన గుర్రాలనెవరన్నా ఎత్తుకుపోతారేమో ?" అన్నాడు క్షత్రియుడు.

"నాగుర్రం తెల్లనిది, చీకట్లో ఎంతదూరాన ఉన్నా కనిపిస్తుంది. నీది నల్లనిది. నీ గుర్రానికే కాపలా అవసరం. నువు మేలుకుని ఉండు!" అన్నాడు వైశ్యుడు.

"నాది బలమైన గుర్రం, నీది ముసలితట్టు. అయినప్పటికీ నాకు నిద్ర ముంచు కొస్తున్నది గనుక, నా గుర్రాన్ని నీ కిచ్చి నీ గుర్రాన్ని తీసుకుంటాను," అన్నాడు క్షత్రియుడు.

"అప్పుడు దొంగలు చీకట్లో నా నల్లగుర్రాన్ని చూడలేరు. నీ తెల్లగుర్రాన్నే చూస్తారు. కనుక నువే మేలుకుని ఉండాలి !" అన్నాడు వైశ్యుడు.

"అయితే నేను గుర్రాలను మార్చుకోవటానికి ఒప్పను!" అన్నాడు క్షత్రియుడు. "నీయిష్టం!" అంటూ వైశ్యుడు పడుకుని గుర్రుపెట్టసాగాడు. క్షత్రియుడు నింపాదిగా లేచి, వైశ్యుడి గుర్రాన్ని విప్పేసి ఏమీ ఎరగనట్టు వచ్చి పడుకుని నిద్ర పోయాడు.

దొంగ నిద్ర పోతూన్న వైశ్యుడు లేచి వెళ్లి అంతదూరం వెళ్లిన తన తెల్లగుర్రాన్ని సులువుగా వెతికి తెచ్చుకుని, క్షత్రియుడి గుర్రాన్ని విప్పేశాడు. తెల్లారి లేచిచూసుకుంటే క్షత్రియుడి గుర్రం లేదు. "నా గుర్రం ఏమయింది ?" అని అతను వైశ్యుణ్ణి అడిగాడు.

"దొంగలు ఎత్తుకుపోయి ఉంటారు. నేను ముందే చెప్పలేదా ? నువు మేలుకుని ఉండవలసింది !" అన్నాడు వైశ్యుడు తన గుర్రం ఎక్కుతూ,





# పాప విమోచనం

కుమారనగరంలో విష్ణుభూతి అనే బ్రాహ్మడుండేవాడు. ఆయనకు దేవభూతి అని కొడుకుండే వాడు. అతను చిన్నతనంలోనే ఎంతో సూక్ష్మబుద్ధి కలవాడై నాలుగు వేదాలూ, ఆరు శాస్త్రాలూ చదివాడు, కాని ఆయన అనేక పాపాలు చేసిన కారణంగా బ్రహ్మరాక్షసి అయిపోయాడు.

బ్రహ్మరాక్షసి అయిపోయాక దేవభూతికి జ్ఞానోదయం కలిగింది. పాపవిమోచనం కోసం ఒక మంచివాడికి విద్యాదానం చేద్దామని నిశ్చయించుకుని, అడవిలో ఉండే ఒక రావిచెట్టుపైన నివాసం ఏర్పరచుకుని, రోజూ వేదపారాయణ చేయసాగాడు.

స్వతహాగా ఎంత పండితుడైనా ప్రస్తుతం బ్రహ్మరాక్షసి కావటంచేత ఆయనలో బ్రహ్మరాక్షసి లక్షణాలుంటూ ఉండేవి. తానుండే రావిచెట్టుకిందికి వచ్చిన జంతువులను విరుచుకు తింటూ ఉండేవాడు. మనుషులెవరైనా వస్తే వారి విద్యలను పరీక్షచేస్తూండేవాడు. వాళ్లు బెదిరి పారిపోయేవారు. ఆ రావిచెట్టుమీద బ్రహ్మరాక్షసి ఉంటున్నదని చుట్టుపక్కలవారందరికీ తెలిసిపోయింది.

దేవభూతి బ్రహ్మరాక్షసి అయిన కొద్ది కాలానికే కుమారనగరానికి ఒక యువకుడు వచ్చాడు. అతని పేరు గోనర్దీయుడు. ఇతను కాశీనివాసి. కాశీలో సకల శాస్త్రాలూ చదివి, కొత్తవిద్యలు నేర్చుకునే ఉద్దేశంతో బయలుదేరి వచ్చాడు. కుమారనగరంలో గల పండితులు అతనిని పరీక్షించి, "నాయనా, మేము నీకన్న పండితులము కాము. నీకు కొత్తవిద్యలు ఏవైనా నేర్పగలవాడు ఇప్పుడీ నగరంలో లేడు. ఆయన బ్రహ్మరాక్షసి రూపంలో అడవిలో రావిచెట్టుమీద ఉన్నాడు!" అని చెప్పారు.

"అయితే నేను అక్కడికే పోతాను!" అన్నాడు గోనర్దీయుడు.

ఎస్. హేమలత

"నిష్కారణంగా చచ్చిపోతావు. అలాటి అఘాయిత్యం చెయ్యకు. నీకు ఇప్పుడున్న పాండిత్యం తక్కువా?" అన్నారు పండితులు.

కాని గోనర్దీయుడు వారి మాట వినక అరణ్యమార్గం పట్టి బయలుదేరి వెళ్లాడు. అంతులేని అడవిలో అతను కొన్నిరోజులు ప్రయాణం సాగించిన మీదట అతనికి దూరాన వేదపఠనం వినిపించింది. గోనర్దీయుడు సమీపానికి వెళ్లి రావిచెట్టును చూసి పరమానందం చెంది, దానికింద కూచుని బ్రహ్మరాక్షసితో సమంగా తాను కూడా పనస చదవసాగాడు.



బ్రహ్మరాక్షసి గుభాల్న గోనర్దీయుడి ముందు దూకి, "ఎవడవురా నీవు? నాతో సమంగా వేదం చదువుతున్నావా?" అని హుంకరించాడు.

"క్షమించండి, స్వామీ. నేను తమతో పోటీకి రాలేదు. తమవద్ద కొత్తశాస్త్రాలు నేర్చుకుందామని వచ్చాను. నాపేరు గోనర్దీయుడు. మాది కాశీ," అన్నాడు గోనర్దీయుడు వినయంగా.

బ్రహ్మరాక్షసికి పరమానందమయింది. "అలాగా నాయనా? ఎవరికైనా విద్యాదానం చేసి పాపవిమోచనం చేసుకుందామని ఎంతోకాలంగా ఎదురుచూస్తున్నాను! నీకేమేమి విద్యలు వచ్చునో చెప్పు!" అన్నది బ్రహ్మరాక్షసి.

గోనర్దీయుడు తాను నేర్చిన విద్యలన్నీ చెప్పాడు. "నీకు రాని విద్యలు నాకేమీ రావే? ఏం చెయ్యాలి?" అన్నది బ్రహ్మరాక్షసి.

గోనర్దీయుడికికూడా నిరాశ కలిగింది. కాని అంతలోనే బ్రహ్మరాక్షసి, "చూడు, నాయనా! నీకు కన్యాదానం చేస్తాను! నీకన్న యోగ్యుడైన బ్రహ్మచారి దొరకడు. నేను చెప్పినట్టు చేస్తావా?" అన్నది. గోనర్దీయుడు సరేనన్నాడు.

"ఇక్కడికి దక్షిణంగా పోతే జయపురం అనే నగరం వస్తుంది. ఆ నగరాన్ని ఏలే

రాజుకు మదయంతి అనే కుమార్తె వున్నది. ఆమె సౌందర్యవతి, విద్యావతి. ఆ పిల్లకు తండ్రి వివాహ ప్రయత్నాలు చేస్తున్నాడు. నేను వెళ్లి ఆమెను ఆవేశించుతాను. నీవు బయలుదేరి రాగానే ఆమెను విడుస్తాను. అప్పుడు రాజుగారు నీకు మదయంతి నిచ్చి పెళ్లి చేస్తారు. నాకు పాపవిమోచనం అవుతుంది!" అన్నది బ్రహ్మరాక్షసి.

అక్కడ జయపురంలో మదయంతి తన భర్తను ఎన్నుకునేటందుకుగాను నానా రాజుల చిత్రపటాలు తెప్పించి, రాజుగారు తన కుమార్తెకోసం దాసీలను పంపాడు. సరిగా ఆ క్షణంలోనే రాజకుమార్తెకు బ్రహ్మరాక్షసి పూనింది. తనకోసం వచ్చిన దాసీలను ఆమె సునాయసంగా ఎత్తి దూరంగా విసిరి పారవేయటమూ, వికటాట్టహాసాలు చెయ్యటమూ సాగించింది.

కొద్దిసేపట్లోనే రాజభవనంలో అల్లకల్లోలం బయలుదేరింది. తనను పట్టుకోవటానికి వచ్చిన భటులను మదయంతి ఒక్కొక్క గుద్దుతో చంపేసింది. ఆహారం పంపితే విసిరికొట్టింది.

రాజుగారు నగరంలో ఉన్న భూతవైద్యులందరినీ పిలిపించాడు. వాళ్లు మంత్రాలు చదివారు, ముగ్గులువేశారు, ఎన్నో తంత్రాలు చేశారుగాని రాజకుమార్తెను సమీపించలేక



పోయారు. సాహసించి సమీపించినవారికి కపాల మోక్షమూ, కాళ్ళు విరగటమూ మొదలైన ప్రమాదాలు జరిగాయి.

పాపం, రాజుగారికి మతిపోయింది. ఆయనకు ఒక్కతే కూతురు. తీరా పెళ్ళిచేద్దామనుకుంటూండగా, శాపంలాగా ఈ భూతం ఆవేశించింది! ఈ వార్త దేశదేశాలకూ వ్యాపిస్తే, ఆమె నెవ్వరూ పెళ్ళాడరు.

"రాజకుమార్తె మదయంతిని ఆవేశించిన భూతాన్ని పారదోలిన వారికి ఆమె నిచ్చి వివాహం చెయ్యటమేగాక రాజ్యాభిషేకం కూడా చేస్తాను!" అని రాజుగారు చాటింపు వేయించారు.

ఈ చాటింపు విని దూరదేశాలనుంచి కూడా భూతవైద్యులు వచ్చి రాజకుమార్తె చేతిలో చావుదెబ్బలు తిన్నారు. అంతకంటె వేరే ప్రయోజనం ఏమీ లేకపోయింది.

ఇంతలో గోనర్దీయుడు జయపురానికి చేరాడు. రాజకుమార్తె స్థితినిగురించి విని రాజుగారివద్దకు వెళ్ళి, "మహారాజా, తమ కుమార్తెను పీడించే భూతాన్ని నేను వదిలిస్తాను!" అన్నాడు.

ఆ యువకుణ్ణి చూసి రాజుగారు జాలిపడి, "వద్దు, నాయనా! ఈ పని కొమ్ములు తిరిగిన మాంత్రికులే చెయ్యలేకపోయారు. పసివాడవు, ఈ పని నీవల్ల కాదు!" అన్నాడు.



గోనర్దీయుడు నవ్వి, "నేను వస్తేగాని వెళ్ళని భూతాన్ని ఇంకొకరు వెళ్ళగొట్ట గలరా, మహారాజా?" అన్నాడు.

రాజుకు ఆ యువకుడిలో గురి కుదిరింది. అతడికి భటులను వెంట ఇచ్చి రాజ కుమార్తె ఉండే ప్రాంతానికి పంపాడు.

ఒక గదిలో రాజకుమార్తె జుట్టు విర బోసుకుని భయంకరాకారంతో నిలబడి ఉన్నది. ఆమె గోనర్దీయుణ్ణి చూస్తూనే గోడలు కంపించేలాగా హుంకరించింది.

వెంటనే గోనర్దీయుడు చేతులు జోడించి ఈ విధంగా చదివాడు:

"భూతేంద్ర, తవ శిష్యోహం; గోనర్ది
యాభిధానకః;
పూర్వోదిత వరం దేహి, దేవభూతే
నమోనమః!"

[భూతరాజా, నేను నీ శిష్యుణ్ణి. నా పేరు గోనర్దీయుడు. ముందు చెప్పిన వరం ప్రసాదించు. దేవభూతికి నా నమస్కారం.]

గోనర్దీయుడు ఈ విధంగా చదివిన మరుక్షణం మదయంతి ముఖంలో వుండిన భీకరత్వమంతా తుడిచివేసినట్టు పోయింది. ఆమె స్పృహతప్పి అక్కడే కుప్పగా కూలి పోయింది.

గోనర్దీయుడి ఆజ్ఞచొప్పున రాజభటులూ, దాసీలూ ఆమెను ఒక తల్పంమీదికి చేర్చి సకలోపచారాలూ చేశారు. ఆమె ఇన్ని దినాలకు మళ్ళీ కొద్దిగా ఆహారం తీసుకోనారంభించి రెండు వారాలలో మామూలు మనిషి అయింది.

రాజుగారు చాటింపు వేసిన ప్రకారమే మదయంతిని గోనర్దీయుడికిచ్చి వివాహం చేసి, ఆ తరవాత అతనికి రాజ్యాభిషేకం కూడా చేశారు.

తరవాత అడవిలో రావిచెట్టుమీద వేద పఠనం విన్నవారెవరూ లేరు. దేవభూతి పాపవిమోచనం పొంది బ్రహ్మరాక్షసి అవతారం చాలించాడు.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1957 సెప్టెంబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూలై నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : సాగితే ప్రయాణం

రెండవ ఫోటో : జారితే ప్రమాదం

పంపినవారు :

పి. కామాచార్యులు, రేమల్లి, వీరవల్లి పోస్టు, నూజివీడు తాలూకా, (కృష్ణాజిల్లా)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# వింత సస్తన జంతువులు

సస్తన (పిల్లలకు పాలిచ్చే) జంతువులలో అతి పురాతనమైనవి కొన్ని అస్ట్రేలియాలో వున్నాయి. ఇతర ప్రాంతాలకూడా ఒకప్పుడిలాటి వింత జంతువులు ఉండి ఉండవచ్చు, కాని ఇతర సస్తన జంతువులతో "పోటీ" చెయ్యలేక అవి ఏనాడో అంతరించాయి. ఆస్ట్రేలియా చుట్టూ సముద్రం పెట్టని కోటగా ఉండటంచేత అక్కడ ఇవి దక్కాయని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ఈ వింత జంతువులలో నాలుగింటిని గురించి తెలుసుకుందాం.

వీటిలో "బాతుముక్కు" అనేది ఒకటి. సస్తన జంతువులలాగా దాని శరీరంమీద రోమాలుంటాయి; కాని దాని ముక్కుమాత్రం బాతు ముక్కులాగా ఉంటుంది. బాతులాగే ఇది గుడ్లు పెడుతుంది, దీని పాదాలుకూడా జాలపాదాలు. ఇది నీటిలో మునిగి అడుగున బురదలో ఉండే జలచరాలను తన ముక్కుతో పైకి లాగి తింటుంది. ఇది ప్రవాహాల గట్ల మీద బొరియలలో నివసిస్తుంది. ఈ బొరియలు 30 అడుగుల పొడుగుకూడా ఉండవచ్చు. ఆడ "బాతుముక్కు" ఒకటి మొదలు మూడు గుడ్లదాకా పెడుతుంది. గుడ్లు పొదిగి పిల్లలయాక అవి తల్లివద్ద పాలు తాగుతూ, కొంతకాలంపాటు అసహాయ స్థితిలో ఉంటాయి. మగ "బాతుముక్కు"ల వెనకకాళ్ళకు ఆరెలుంటాయి. వీటిలో విషం వుంటుంది. సృష్టిలో విషపూరితమైన సస్తన జంతువు "బాతుముక్కు" ఒకటే.

"ఎకిడ్నా" అనే మరొక వింతమృగంకూడా గుడ్లు పెడుతుంది. అయితే పెట్టిన గుడ్లను అది వెంటనే తన పొట్టకుండే తిత్తిలో వేసేసుకుంటుంది. ఈ తిత్తిలోనే అవి పిల్లలై కొద్ది వారాలపాటు ఉంటాయి. దీని తిత్తిలో ఒకేసారి రెండు పిల్లలకు చోటున్నది. ఈ జంతువు



శరీరంమీద బొచ్చుకు బదులుగా ముళ్ళుంటాయి. దీని కాలి గోళ్లు బలంగా ఉండి చీమల పుట్టలను నిర్మూలించటానికి అనుకూలంగా ఉంటాయి. దీని ముక్కూ, నాలుకా చాలా పొడుగుండి చీమలను తినటానికి అనువుగా ఉంటాయి.

కొ అలా, కంగరూ జంతువులకుకూడా తిత్తులుంటాయిగాని అవి గుడ్లు పెట్టవు, పిల్లలనే పెడతాయి. అవి పుట్టినప్పుడు చాలా చిన్నవిగా, అసహాయంగా ఉండి, తల్లి తిత్తిలో పెరిగి తమ సహజస్వరూపం పొందుతాయి. అవి తిత్తినుంచి బయటికి వచ్చినాకకూడా ఆపత్సమయాలలో తిరిగి ఆ తిత్తిలో దాక్కుంటాయి.

కొ ఆలా అన్నది ఒక రకమైన ఎలుగుబంటి జాతి. అది చెట్లమీద నివసిస్తుంది. యూకలిప్టస్ చెట్ల ఆకులు దీని ముఖ్య అహారం. దీని పిల్లలు మూడు మాసాలపాటు తల్లి తిత్తిలో ఉండి, తరవాత చాలా మాసాలపాటు తల్లి వీపుమీద సవారీ చేస్తాయి. పిల్లలను వీపున పెట్టుకునే తల్లి చెట్లు ఎక్కుతుంది, దూకుతుంది. ఇవి పగలు నిద్రపోతాయి.

కంగరూ పిల్లలు తల్లి తిత్తిలోనే సవారీ అవుతాయి. కాని కంగరూ ఒక్క ఊపున 25 అడుగులు సయితం దూకగలదు గనక, దాని తిత్తిలో ఉండే పిల్లకు ఈ సవారీ సరదాగానే ఉండవచ్చు!

పైన చెప్పిన మృగాలు ఆస్ట్రేలియాకు చెందినవి. ఉత్తర అమెరికాలో కూడా ఒక వింత మృగం ఉన్నది. దాని పేరు ఒపాసం. ఇదికూడా తిత్తిలో పిల్లల్ని పెడుతుంది. ఐతే ఇది తడవకు 15 పిల్లలనుకూడా పెట్టవచ్చు. దీని పిల్లలుకూడా తల్లివీపుమీదనే సవారీ అవుతాయి. ఉత్తర అమెరికాలో ఈ పురాతన జంతువు ఎలా దక్కిందో ఊహించటం కష్టం.





# వార్తలు-విశేషాలు

విశాఖపట్టణం రేవులో, సరుకుల ఎగుమతి, దిగుమతికి అవసరమైన అన్ని సౌకర్యాలు ద్వితీయ పంచవర్షప్రణాళిక (1960-61) ముగిసేలోగా లభించగలవు. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో విశాఖపట్టణం రేవులో మొత్తం ఏడు 'బెర్తులు' నిర్మించబడగలవు.

*  *  *  *

దేశంలో పండ్లను నిలవచేసే పరిశ్రాభివృద్ధికిగాను, ద్వితీయ పంచవర్షప్రణాళిక కాలంలో 55 లక్షల రూపాయిల మొత్తం కేటాయించబడింది.

*  *  *  *

హైదరాబాదు నగరంలో మురికిపేటలు తొలగించటానికి, రోడ్ల అభివృద్ధికిగాను 1957-58 సంవత్సరానికి 10 లక్షల 29 వేల రూపాయిలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మంజూరుచేసింది.

*  *  *  *

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు ఆయుర్వేద వైద్యానికి సంబంధించిన విషయాలపై సలహా లివ్వటానికి 17 మంది సభ్యులు గల ఒక బోర్డును ఏర్పాటుచేశారు. దీనికి డాక్టర్ ఎ. లక్ష్మి పతిగారు అధ్యక్షులు.

*  *  *  *

దేశంలో మరి మూడు పంచదార శుద్ధి కర్మాగారాలను స్థాపించేందుకు, జెకోస్లోవాకియా అంగీకరించింది. వీటిలో ఒకటి మద్రాసులో నెలకొల్పబడుతుంది.



న్యూ ఢిల్లీలోని కేంద్ర రోడ్ల పరిశోధన సంస్థ కనిపెట్టిన కొత్త విధానంవల్ల, దేశంలోని రోడ్లపై రాకపోకలను ఆటోమాటిక్ సిగ్నల్స్‌ద్వారా అదుపులో పెట్టటానికి తలపెట్టబడింది. ఆటోమాటిక్ పద్ధతి ప్రవేశపెడితే ఆకుపచ్చ, పసుపుపచ్చ, ఎరుపు సిగ్నల్సు ద్వారా రాకపోకలు అదుపులోకి తీసుకురాబడతాయి.

*  *  *  *

దేశంలో పట్టు పరిశ్రయాభివృద్ధికిగాను కేంద్రప్రభుత్వం నాలుగురాష్ట్రాలకు, ఆరు లక్షల రూపాయిల గ్రాంటులు మంజూరుచేసింది. ఆ రాష్ట్రాలు ఇవి: ఒరిస్సా, ఉత్తరప్రదేశ్, అస్సాం, మైసూరు.

*  *  *  *

నాగార్జున కొండ త్రవ్వకాలలో బుద్ధుని కాంస్య విగ్రహం ఒకటి బయటపడింది. ఇందులో బుద్ధుడు కుడిచేత బాణాన్ని, ఎడమచేత విల్లును పట్టుకుని ఉన్నట్టు చెక్కబడింది. ఇంకా ఈ త్రవ్వకాలలో అశ్వమేధ యాగం జరిగిన ఒక వేదిక, తటాకం, గుర్రం ఎముకలు కూడా కనిపించినవి.

*  *  *  *

కేంధ్రప్రభుత్వం నాలుగేళ్ళక్రితం కమ్యూనిటీ ప్రాజెక్టులను ప్రారంభించిన తరవాత, 1956 ఆఖరుకు నూరుకోట్ల రూపాయలు ఖర్చుపెట్టింది. ఈ మొత్తంలో ప్రభుత్వం ఖర్చు పెట్టిన మొత్తం 60·04 కోట్ల రూపాయలు. దేశంలోని గ్రామాలలో సుమారు సగానికి పైగా, ఈ ప్రాజెక్టులవల్ల లాభం పొందాయి.

*  *  *  *

ప్రధాని నెహ్రూ రెండు వారాలపాటు డెన్మార్క్, ఫిన్లాండు, నార్వే, స్వీడన్ దేశాలలో పర్యటించి, జూన్ 25-వ తేదీన లండన్ చేరారు. ఆయన అక్కడ జరుగుతున్న కామన్‌వెల్తు ప్రధానమంత్రుల సమావేశంలో పాల్గొంటున్నారు.



# చిత్రకథ





ఒకరోజున ఒక గారడీవాడు, నాలుగుదార్లు కలిసేచోట ప్రదర్శనం ఏర్పాటు చేసి, అది ముగిసే సమయాన జంతువులా, పక్షులా అరుపులు అరవ సాగాడు. దాసూ, వాసులుకూడా ఆ ప్రదర్శనానికి వెళ్లి, సంచీలోవున్న 'టైగర్'ను గిల్లి అది బాధతో అరచినప్పుడల్లా, తామే అలా అరుస్తున్నట్టు నాటకమాడసాగారు. కాని, యింతలో అక్కడికి కొన్ని కుక్కలు వచ్చి మొరగటం ప్రారంభించినై. 'టైగర్' సంచీలోంచి ఒక్క దూకున బయటపడి, వాటికేసి పరిగెత్తింది. అక్కడచేరిన వాళ్లందరూ దాసూ, వాసూల మోసం కనిపెట్టి, విరగబడి నవ్వారు.





Printed by B. NAGIREDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'

# ఇక యిప్పుడు, ప్రతిఒక్కరూ సంపాదించటానికి
# వీలయిన **టేప్ రికార్డర్**! ఇక్కడ ఉన్నది!




ఎంతకాలంనించో కావాలని మీరు ఆత్రంతో నిరీక్షించిన గ్రండిగ్ టేప్ రికార్డరు ఇప్పుడు మీకు అందుబాటులో ఉన్నది. ఇంతటి తక్కువ ధరకు ఇవ్వగల్గటానికి కారణం యంత్రనిర్మాణాన్ని సుకరం చేయటమే. అయితే ఉన్నతస్థాయిని అందుకొన్నటువంటి గ్రండిగ్ పనితనము, అసమానమైన నాణ్యము, డిజైను శోభ—ఇవన్నీ ఎప్పటిలాగానే ఉంటున్నవి.

వెల రు. 1,050/-

ఒకటి కొని, యావజ్జీవితమూ
కుటుంబానికి వినోదము చేకూర్చండి.

డిస్ట్రిబ్యూటర్లు:

**మహమ్మద్ ఇబ్రహిం అండ్ కో (ప్రైవేట్) లిమిటెడ్.,**

7/8 మౌంట్ రోడ్, మద్రాసు - 2

బ్రాంచీలు: 26 / 27 రత్తన్ బజార్, మద్రాసు - 3
113-H బ్రిగేడ్ రోడ్, బెంగళూరు - 1

చూడండి! సన్‌లైట్ సగంబిళ్ల
మాత్రమే ఈ బట్టలన్నిటిని
ఉతికింది!

అట్లు చేసినట్టిది దాని
అధికమైన నురగ!




సన్ లైట్ సబ్బు బట్టలను
తెల్లగాను, కాంతివంతముగాను
ఉతుకును

S. 248-50 TL

Photo by E. Ramalingam



బహుమతి పొందిన వ్యాఖ్య

జారితే ప్రమాదం

పంపినవారు :
పి. కామాచార్యులు - రేమల్లి

